**Results of Chandamama—Camlin Colouring Contest No. 17 (Telugu)**

*1st Prize:* Nistala Krishnaveni, Anakapalle. *2nd Prize:* S. Tharkeswar Pattnaik, Balasore. *3rd Prize:* R. Raghavendra, Bangalore-27. *Consolaton Prizes:* Nageswara Rao Jana, Mori-533250; M. N. Mohan, Bangalore; G. Sireesh, Madras-17; T. J. Balaji, Pakala P.O.; Sunkabi Gunta Padmavathi, Maharani Peta Post.



# చందమామ

ఫిబ్రవరి 1981



ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు






విడి ప్రతి: 1-50

సంవత్సర చందా: 18-00

# న్యూట్రిన్

## మిఠాయిలు, టాఫీలు

FOR YOUR SWEET PLEASURE

nutrine

ఛొక్కమిఠాయి యందు
షడ్రస పూరిత విందు!




న్యూట్రిన్ కన్ఫెక్షనరీ కంపెనీ లిమిటెడ్, చిత్తూరు-517 002 (ఆం.ప్ర.)

CASNC44/80 TE B

డాక్టరుగారూ! మా బొమ్మ
పాపాయికి వంట్లో
బాగాలేదు. కొంచెం చెక్ చేసి
చెప్పండి సార్.

జ్వరంలాంటిదేం కాదు.
కడుపులోనే ట్రబుల్.
ఉడ్‌వర్డ్స్ గ్రైప్ వాటర్
ఇవ్వండి. తగ్గిపోతుంది.

ఇది వర్షాకాలం
కదా డాక్టర్.
ఉడ్‌వర్డ్స్ గ్రైప్
వాటర్ ఇవ్వవచ్చా?

దానికేం? ఎండాకాలమైనా, వర్షాకాలమైనా
చలికాలమైనా, ఏ కాలమైనా సరే,
పిల్లలకు కడుపులో ఎలాంటి ట్రబుల్
వచ్చినా ఉడ్‌వర్డ్స్ గ్రైప్ వాటర్
ఇవ్వండి.






100 ఏళ్లుగా మాతృలోకం
విశ్వసించినది

# ఉడ్‌వర్డ్స్ గ్రైప్ వాటర్

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి

ఈ నెల బేతాళకథ [''మాయఅద్దం'']కు ఆధారం రాంబాబు రచన. ఒక కార్యం సక్రమంగా నెరవేరడం, నెరవేరక పోవడం మంచి, చెడుశకునాల మీద ఆధారపడి వుంటుందని నమ్మేవాళ్ల ప్రవర్తన, ఒకొక్కసారి ఎలాంటి వింతపరిస్థితులకు దారి తీస్తుందో, ''శకునం'' అన్న కథలో తెలుసుకుంటాం.

## అమరవాణి

స్వభావోనోపదేశేన శక్యతే కర్తుమన్యథా,
సుతప్తమపి పానీయం పునర్గచ్ఛతి శీతతామ్.

[ఎంత బోధించీ మనుషుల సహజస్వభావాన్ని మార్చడం సాధ్యం కాదు. స్వభావసిద్ధంగా చల్లగా వుండే నీటిని కాచి వేడి పరిచినా, కొంతసేపటికి ఆ నీరు తిరిగి చల్లబడిపోతుంది.]

సంపుటి 68 ఫిబ్రవరి 81 సంచిక 2

విడి ప్రతి : 1-50 : : సంవత్సర చందా : 18-00




CHITRA




ఎరిక్ డేన, పాంగ్లా

ప్ర: భారతంలోని ఆదినివాసులు ద్రావిడులనీ, కాదనీ చెబుతారు ? మీ అభిప్రాయం తెలుపగలరా ?

స: ఈనాడు మనం మానవజాతులుగా చెప్పుకునేవి 30, 40, వేల ఏళ్ళనాడు లేవట. కాని వానరలక్షణాలు వదిలించుకొని నరవానర రూపాలు భారతదేశంలో బయటపడ్డాయి—ఉదాహరణకు, రామాపితికస్ (140 లక్షల ఏళ్ళనాటిది). ఈ ఒక్క కారణాన్ని బట్టే మన దేశంలో నివసించిన తొలి మానవులకు ఒక జాతిపేరు అంటగట్టటం పొసగదని స్పష్టమవుతుంది. అది అలా ఉండగా "ద్రావిడ" పదం ఒక జాతికి చెందినదా, భాషకు చెందినదా, లేక జీవిత విధానానికి చెందినదా: ఇది స్పష్టంగా తెలియాలి. అంతర్జాతీయంగా మానవజాతులు (లేక ఉపజాతులు) అని చెప్పబడే వాటిలో ద్రావిడజాతి అన్నది లేదు. మనకున్న అత్యంత ప్రాచీనమైన వైదికసాహిత్యంలో ఆర్యులూ, దాసులు (దస్యులూ) చెప్పబడ్డారు, కాని ద్రావిడుల ప్రస్తాపన లేదు. అనాటి అనార్యులు "ముక్కులేని" (చట్టిముక్కు) మనుషులు గానూ, నల్లని వాళ్ళుగానూ వర్ణించబడ్డారు. ఇవి జాతిలక్షణాలు అనుకుంటే అచ్చగా ఈ లక్షణాలు గల జాతులు భారతదేశంలో ఎక్కడా లేవు. ఆ మాటకు వస్తే ఆర్యశబ్దం కూడా జాతివాచకం కాదు. అయేటట్టుంటే విష్ణువూ, రాముడూ, కృష్ణుడూ లాటి అవతారపురుషులు ఆర్యులు కాకుండా పోవాలి. భారతంలో చెప్పబడిన వ్యాసుడు కూడా ఆర్యుడై ఉండటానికి వీలులేదు. భారతంలో అతని వర్ణన సూటిగా రాకనుష్ణే స్ఫురింపజేస్తుంది. అందుచేత ద్రావిడులూ, ఆర్యులూ అనే మాటలను వాడే వాళ్ళు అవి జాతుల పేర్లు అని భ్రమపడిన వాళ్ళో, లోకాన్ని భ్రమపెట్టే వాళ్ళో అయిఉంటారు. ఈనాడు మనకు నిజంగా ఉన్నవి ద్రావిడ భాషలూ, ద్రావిడ భాషా కుటుంబాలూనూ. ఈ భాషలు అనాదిగా ఉన్న వనుకునేటందుకు అవకాశం లేదు. హరప్పానాగరికతకు చెందిన చిత్రలిపి ద్రావిడభాష అని కొందరు వాదిస్తున్నారు. అది నిజమేననీ, ఆ భాషను ఉపయోగించిన వారిని ద్రావిడులు అనవచ్చుననీ అనుకున్నా, భారతదేశంలో ఆదినుంచీ ఉన్నది హరపా నాగరికత సృష్టించిన వారేననటానికి ఆధారం లేదు.



# ముగ్గురు అధికారులు

విశ్వశాంత మహారాజు పరిపాలన అపూర్వ మని చెప్పుకునేవారు. ఆయన రాజ్యంలో ప్రతి గ్రామానికీ స్వపరిపాలన ఉండేది. రాజు ఏటా కొన్ని గ్రామాలు సందర్శించి, అక్కడి పరిపాలన ఎలా కొనసాగుతున్నదీ స్వయంగా విచారించేవాడు. దేశానికి సంబంధించిన వార్తలు గుర్రాల మీద దేశం అన్నిమూలలకూ అందేవి. ప్రతి గ్రామం నడిబొడ్డులోనూ ఎప్పటి వార్తలు అప్పుడు తెలియజేయబడేవి.

ఒక సంవత్సరం రాజు పర్యటనకు బయలుదేరి మొదట రామపురం వెళ్లాడు. అక్కడి అధికారి రామరాజు రాజుగారికి తన ప్రస్తుత కార్యక్రమం నివేదించాడు.

రామపురం చాలా పెద్ద గ్రామం. గ్రామ పరిపాలన నిర్వహించటానికి వందమంది ఉద్యోగులున్నారు. వారందరూ ఉదయం నుంచి సాయంకాలం వరకూ కొలువుకు వచ్చి, వ్యవహారాలు చూస్తారు. అయితే ఉదయం ఒక్కరూ సమయానికి రావడం లేదు. కొందరు మరీ ఆలస్యంగా వస్తు న్నారు. దీన్ని అరికట్టడం కోసం రామరాజు ప్రతిరోజూ అందరికన్న ముందుగా వచ్చి, గుమ్మం దగ్గర నిలబడి, ఆలస్యంగా వచ్చిన వారిని తగిన విధంగా శిక్షిస్తూ వచ్చాడు. అలా అతను వారం దినాలు చేసిన అనంతరం ఉద్యోగులు ఇష్టం వచ్చినట్టు రావడం తగ్గిపోయింది.

రామరాజు చెప్పిన ఈ సంగతులు విని రాజుగారు, "కొలువుకు ద్వారపాలకుడు లేడా? నువు స్వయంగా సేకరించిన సమా చారం వాడి ద్వారానే సేకరించవచ్చు గదా?" అన్నాడు.

"ప్రభూ, ద్వారపాలకుడు చిన్న ఉద్యోగి. అతడు మిగతా ఉద్యోగులంటే భయపడతాడు. అందుచేత వారికి వ్యతిరే

"వసుంధర"



కంగా ఏమీ చెప్పడు. అధికారిని గనక, నేను గుమ్మంలో నిలబడితే ఉద్యోగులు భయపడతారు,'' అన్నాడు రామరాజు.

''ద్వారం వద్ద నిలబడడానికి సిగ్గుగా, అవమానంగాలేదా ?'' అన్నాడు రాజు.

''విధినిర్వహణలో నాకు సిగ్గూ, అవమానమూ ఉండవు,'' అన్నాడు రామరాజు గర్వంగా.

''అయితే, నేటినుంచీ నువు ద్వారపాలకుడివిగా ఉండు. ఈ గ్రామానికి మరో అధికారిని నియమిస్తాను,'' అన్నాడురాజు.

రాజుగారు తనను మెచ్చుకుంటాడనుకున్న రామరాజు తెల్లబోయి, ''ఇది అన్యాయం, ప్రభూ !'' అన్నాడు.

''ఇందులో అన్యాయం ఏమీ లేదు. ఇక్కడి కొలువులోని వారందరికీ అధికారివి, అయినా ఇక్కడి ద్వారపాలకుడు నీ కంటె, నీ కింది అధికారులను ఎక్కువ అభిమానించి, గౌరవిస్తున్నాడు. గుమ్మం దగ్గిర నిలబడితే తప్ప నీ కింది ఉద్యోగులు నిన్ను లెక్కచెయ్యడం లేదు. అన్నింటినీ మించి, ఎంతో విలువైన నీ సమయాన్ని ద్వారపాలనకు వెచ్చిస్తున్నావు. ఈ ఒక్క బాధ్యతనే నువు సరిగా నిర్వర్తిస్తున్నట్టున్నది !'' అని రాజుగారు ఆ గ్రామానికి ఒక కొత్త పాలకుణ్ణి నియమించి, అక్కడి నుంచి భీమపురం వెళ్ళాడు.

రాజుగారు తాను భీమపురం వెళుతున్నట్టు ముందుగా ఎవరికీ చెప్పలేదు. ఆయనకన్న ఒక్క గంట ముందుగా మాత్రమే ఆ వార్త భీమపురం చేరింది. అక్కడి అధికారి రాజుగారు వస్తున్నారన్న వార్త ఊరి మధ్య వినిపించినప్పుడు తన కార్యాలయంలో కాక, ఊరి మధ్య ఉన్నాడు. అతను హడావుడిగా కార్యాలయానికివెళ్ళి, రాజుగారికి ఘనమైన స్వాగతం ఏర్పాటు చెయ్యమని ఉద్యోగులను హెచ్చరించాడు.

భీమపురం చేరుతూనే తన కోసం సిద్ధంగా ఉన్న ఏర్పాట్లు చూసి రాజుగారు తెల్లబోయాడు. అకస్మాత్తుగా వచ్చి, అధికారిని ఆశ్చర్యపరచాలని ఆయన ఉద్దేశం.

"నేను వస్తున్నట్టు మీకు ముందే ఎలా తెలిసింది?" అని రాజుగారు గ్రామాధికారిని అడిగాడు.

తాను గొప్ప పని చేసి, ప్రశంసకు పాత్రుడి నవుతున్నా ననుకుని, "నేను తలవని తలంపుగా తమరు వస్తున్న వార్త వినడం జరిగింది, ప్రభూ! వెంటనే తమ కోసం ఈ ఏర్పాట్లన్నీ చేయించేశాను," అన్నాడు భీమరాజు.

"నీ కార్యాలయం చూడబోతే ఊరి చివర ఉన్నది. వార్తలు వినపడేది ఊరి మధ్య గద! ఆ సమయంలో నువు నీ కార్యాలయంలో ఉండక, ఊరి మధ్య ఎందుకున్నావు?" అని రాజుగారు అడిగాడు.

"ఏదో కొలువు పని మీదనే బయటికి వెళ్ళవలసి వచ్చింది, ప్రభూ!" అన్నాడు భీమరాజు.

"నీ కింద ఎందరో ఉద్యోగులుండగా, కొలువు సమయంలో నువు ఎందుకు బయటికి వెళ్ళవలసి వచ్చింది? నీకు నీ బాధ్యతలు సరిగా తెలిసిరాలేదు. నీ స్థానంలో మరొక అధికారిని నియమిస్తున్నాను," అని రాజు అప్పటికప్పుడే కొత్త అధికారిని నియమించి, సోమపురానికి బయల్దేరాడు.

సోమపురంలోని అధికారి సోమరాజు విశ్వశాంతుడికి ఘనంగా స్వాగతం ఏర్పాటు చేశాడు. "స్వాగతసత్కారాలు



చాలా బాగున్నాయి. అధికారిగా నువు సాధించినది ఏమిటి?" అని విశ్వశాంతుడు సోమరాజును అడిగాడు.

"ప్రభూ! నేను గ్రామంలో ఉండడం శుభదాయకమని అందరూ అంటూంటారు. అందుకు నిదర్శనం ఏమిటంటే, గ్రామంలో జరిగే సంతాప సభ లన్నీ నేను గ్రామంలో లేనప్పుడే జరుగుతున్నాయి," అన్నాడు సోమరాజు.

"సంతాపసభ లేమిటి?" అని విశ్వశాంతుడు అడిగాడు.

"రాజ్యంలో గాని, గ్రామంలో గాని ఎవరన్నా మరణించినప్పుడు, కొలువులో సంతాపసభ జరిపి, పోయినవారికి

శ్రద్ధాంజలి ఘటించడం మాకు అలవాటు. ఈ కార్యక్రమం నిర్వహించవలసినవాడు అధికారి, అంటే నేను. నా తర్వాతవాడైన వీరభద్రుడు గత సంవత్సరంలో ఇరవై ఆరుగురు ప్రముఖుల మరణాలకూ తానే సంతాపసభలు నిర్వహించాడు,'' అన్నాడు సోమరాజు.

''శుభకార్యాల మాటేమిటి ?'' అని రాజుగారు అడిగాడు.

''నేను లేనప్పుడు శుభ కార్యాలు ప్రారంభించం గదా! అవి అన్నీ నా అధ్యక్షతనే జరుగుతాయి. అందుకే అందరూ నన్ను శుభానికీ, వీరభద్రుణ్ణి అశుభానికీ మారుపేరుగా చెప్పుకుంటారు. అయితే ఇందులో వీరభద్రుడి తప్పు ఉన్నదనటానికి లేదు. అశుభాలు వీరభద్రుడు ఉన్న కారణంగా కాదు, నేను లేని కారణంగా గదా జరుగుతున్నాయి!'' అన్నాడు సోమరాజు గర్వంగా.

విశ్వశాంతుడు చిరాకుపడుతూ సోమరాజు వంక చూసి, ''సంవత్సరానికి ఇరవై ఆరు పర్యాయాలు, అంటే ఉజ్జాయింపుగా నెలకు రెండు పర్యాయాలైనా, ప్రముఖుల మరణాలు జరుగుతున్నాయన్నమాట. అయినా నువు ఒక్క సంతాపసభకూ లేవంటే, చాలాకాలం నువు గ్రామాంతరాలలో గడుపుతున్నావన్నమాట! కేవలమూ శుభకార్యాలు జరపటానికి మాత్రమే గ్రామానికి వస్తున్నావన్నమాట! బాధ్యత ఉండాలి గాని, ఇలా బయట తిరగకూడదు. నీ స్థానంలో వీరభద్రుణ్ణి అధికారిగా నియమిస్తున్నాను,'' అన్నాడు.

సోమపురంనుంచి బయలుదేరేటప్పుడు మంత్రి, విశ్వశాంతుణ్ణి, ''ఇంకేమన్నా గ్రామాలు తిరగవలసి ఉన్నదా, ప్రభూ?'' అని అడిగాడు.

''అవసరంలేదు. ఈ మూడు గ్రామాల అధికారులతోనూ నేను ఎలా వ్యవహరించానో రాజ్యమంతటా తెలియజెయ్య, చాలు!'' అన్నాడు విశ్వశాంతుడు.

విశ్వశాంతుడి రాజ్యం ఎప్పటికీ సుభిక్షంగానే ఉంటూ వచ్చింది.






## 10

[చతుర్నేత్రుడు తనకూ, ఏకాక్షికీ వున్న బాల్యవిరోధం గురించి సమరసేనుడికి చెప్పాడు. ఇద్దరం ఒకే ఊరి వాళ్ళమనీ, ఒక లేడిపిల్ల కోసం కలహించటం జరిగిందనీ తెలియపరిచాడు. సింహం భయంతో, తానొక చెట్టుమీద దాక్కోగా, ఏకాక్షి అక్కడికొచ్చిన ఊరివాళ్ళకు తాను దయ్యం అని చెప్పి నమ్మించాడనీ, వాళ్ళు పారిపోయారనీ చెప్పాడు. తరవాత--]

చతుర్నేత్రుడు, తన మీద ఏకాక్షి ప్రయోగించిన మాయోపాయాన్ని గురించి చెప్పేటంతలో, కొండ దిగువ పెద్ద కోలాహలం బయలుదేరింది. సమరసేనుడూ, సైనికులూ ఆ ధ్వని వచ్చిన వైపుకు ఆశ్చర్యపోతూ చూశారు.

అప్పటికి సూర్యాస్తమయం అయి కొద్దిసేపే అయింది. ఆ కొండప్రాంత మంతా నల్లనిచీకటి కమ్ముకుంటున్నది. దూరంగా మనుషులు అరవటం తప్ప, వాళ్ళు ఎక్కడ వున్నదీ, ఎటుకేసి పోతున్నదీ సమరసేనుడికి కనిపించలేదు. అంతలో ఏకాక్షి మాంత్రికుడి కంచుకంఠం, "కాలభుజంగా! కపాలా!" అంటూ బిగ్గరగా కేక పెట్టటం వినబడింది.

చతుర్నేత్రుడు ఒక్క తృటికాలం అటుకేసి దృష్టి సారించి, "సమరసేనా! ఒక వైపునుంచి మీ కుండలినీ మను




షులూ, రెండవ వైపునుంచి ఏకాక్షి వస్తున్నారు. నావా, నాగకన్యల కథ తరవాత చెపుతాను. ముందు, యీ వచ్చేవాళ్ళ కంటబడ కుండా తప్పుకుపోవటం అన్ని విధాలా క్షేమంగా వుంటుంది," అన్నాడు.

సమరసేనుడికి ఆ పరిస్థితుల్లో అంత కంటే చేయదగింది, ఏమీ లేదనిపించింది. చతుర్నేత్రుడు, కుండలినీ మనుషులు అనటంలోనే, వాళ్ళు ద్రోహి కుంభాండుడూ అతడి నాయకత్వం కింద వున్న అటవికులూ అని తెలుస్తున్నది.

"అరుగో, వాళ్ళు యిటే వస్తున్నారు. కొండ ఎక్కుతున్నారు!" అంటూ చతుర్నేత్రుడు తన చూపుడు వేలిని కొండ దిగువ ప్రాంతాని కేసి ఎత్తాడు. సమరసేనుడూ, సైనికులూ అటుకేసి చూశారు. దాదాపు నలభై, యాభైమంది మనుషులు దివిటీలు పట్టుకుని అరుస్తూ కొండ ఎక్కుతున్నారు.

సమరసేనుడు కత్తిపిడిమీద చేయి వేసి, "చతుర్నేత్రా, యిప్పుడు కర్తవ్యం ఏమిటి? ఆ ఒక్క కుంభాండుడినే అయితే, నా వెంట వున్న యీ ఐదుగురు సైనికులతోనే ఎదుర్కోగలను. సుశిక్షితులైన నా సైనికుల బాణాలధాటిక, ఆ అటవికులు నిలబడలేరు. కాని, మాంత్రికుడైన యీ ఏకాక్షి మాటేమిటి?" అన్నాడు.

"సరే, ఆ ఏకాక్షి సంగతి నాకు వదులు. కాని, ఒక్క విషయం గుర్తుంచుకో! నువ్వు యీ కొండప్రాంతాల, యీ చీకటిలో కుంభాండుణ్ణి ఎదుర్కోవటం అంత మంచిది కాదు. ఒకవేళ ఆ కుంభాండుడూ, అటవికులూ ఏకాక్షి కంటబడటం జరిగితే, నువ్వు చెయ్యాలనుకుంటున్న శత్రుసంహారం, అతడే చేస్తాడు." అన్నాడు చతుర్నేత్రుడు.

చతుర్నేత్రుడు యిలా చెపుతున్నంతలో, కొండ ఎక్కుతూ, ఉత్సాహంగా కేకలు వేస్తున్న అటవికులనూ, వాళ్ళకు ముందుండి నడుపుతున్న కుంభాండుణ్ణీ, ఏకాక్షి ఎదురై అటకాయించాడు.

ఇది చూసిన సమరసేనుడు, సంతోష పడిపోతూ, "ఇదీ కథ! ఈ క్షణం ఎప్పు డొస్తుందా అని చూస్తున్నాను," అన్నాడు.

చతుర్నేత్రుడు తల అడ్డంగా తిప్పుతూ, "సమరసేనా, తొందరపడి లేనిపోని ఆశలకు పోకు. ధనరాసులతో వున్న నావా, నాగకన్య వృత్తాంతం నీకు సరిగా తెలియదు. వాటిని గురించిన నిగూఢ రహస్యం, ఆఖరుకు నీకైనా ముందుగా నేను చెప్పలేను. పైగా, ఏకాక్షి వదరు బోతు అయినా, కేవలం బుద్ధిహీనుడు మాత్రం కాదు. ఆ పెద్ద బండరాతి వెనక దాక్కుందాం, పదండి," అన్నాడు.

అందరూ నిశ్శబ్దంగా చతుర్నేత్రుణ్ణి అనుసరించి నడిచారు. కొంత సేపటికి అందరూ, కుంభాండుడు ఆటవికులతో వున్న ప్రదేశానికి దాపులనున్న ఒక పెద్ద రాతి వెనక భాగానికి చేరారు.

ఇంతలో ఏకాక్షిని చూస్తూనే కుంభాం డుడు భయకంపితుడయ్యాడు. అతడి వెంట వున్న ఆటవికులు పారిపోయేందుకు దిక్కులు చూస్తున్నంతలో ఏకాక్షి పెద్దగా నవ్వి, "మీలో ఎవరైనా వున్నచోటు నుంచి కదిలారో, చావు తప్పదు. నా కంట బడిన ప్రాణి, నా ఆజ్ఞలేకుండా కదిలేం దుకు వీల్లేదు!" అంటూ తలతిప్పిచూసి, "కాలభుజంగా! కపాలా! వీళ్ళను చుట్టుముట్టండి!" అని, కేక పెట్టాడు.

వెంటనే కాలభుజంగం ముందుకు దూకి, బుసలు కొడుతూ ఆటవికుల






చుట్టూ తిరగసాగింది. కపాలం గాలిలో గిర్రున తిరుగుతూ, వాళ్ళ తలలపై ఆడసాగింది. భయకంపితులై నిలువెల్లా వణికిపోతున్న కుంభాండుణ్ణీ, ఆటవికులనూ కన్నెర్రచేసి చూస్తూ, ఏకాక్షి, "మీ రెవరు? ఎక్కడకీ ప్రయాణం?" అని అడిగాడు.

ఆ ప్రశ్న వింటూనే కుంభాండుడు, మరింతగా వణికిపోసాగాడు. అతడికి నిజం చెప్పాలో, అబద్ధం చెప్పి తప్పించుకోవచ్చునో తెలియలేదు. ఈ ద్వీపంలో వున్న మాంత్రికులను గురించి అతడు ఆటవికుల ద్వారా వినివున్నా, చూడటం యిదే మొదటిసారి.

"నేను. యీ ఆటవికులకు రాజును. నా పేరు కుంభాండుడు," అని మాత్రం చెప్పగలిగాడు కుంభాండుడు.

"మరి, యీ ప్రయాణం?" అన్నాడు ఏకాక్షి పళ్ళు కొరుకుతూ.

ఇక నిజం చెప్పక తప్పదనిపించింది, కుంభాండుడికి. ఒకవేళ తను నిజం దాచినా, ప్రాణభయంలో వున్న ఆటవికులు నిజం చెప్పక మానరు, అనుకున్నాడు.

"ఈ కొండ శిఖరం మీది నుంచి చూస్తే, సముద్రంలో ఒక నావ కనబడుతుందని విన్నాను. దాన్ని చూసేందుకు వెళుతున్నాను," అన్నాడు కుంభాండుడు.

ఈ జవాబుకు ఏకాక్షి బిగ్గరగా నవ్వాడు. అతడికి యీ ఆటవికులూ, కుంభాండుడూ అక్కడికి, ఎందుకు వెళుతున్నారో తెలుసు.

"ఈ చీకటిలో కేవలం నావను చూసేందుకు, యీ కొండశిఖరం ఎక్కుతున్నావన్నమాట! అహాఁ, నీ తెలివితేటలు అమోఘం. నీకు యీ అనాగరిక ఆటవికుల మీద రాజరికం కన్న, దేవతలందరిపైనా ఇంద్రపదవి లాటిది, తగిన పని. నిజం చెప్పు, నీవు ఆ నావలోని ధనరాసుల కోసం కదా బయలుదేరింది?" అని అడిగాడు ఏకాక్షి.

కుంభాండుడు గజగజలాడుతూ, నేల చూపులు చూడసాగాడు. ఏకాక్షి గద్దిస్తూ, "అవునా, కాదా ?" అన్నాడు.

కుంభాండుడు బొంగురుపోయిన గొంతుతో, "అవును !" అన్నాడు.

ఏకాక్షి తృప్తిగా తలాడించి, "ఈ ద్వీపంలో ఐదారుగురు కొత్తవాళ్ళను చూశాను. దుస్తుల తీరునుబట్టి, వాళ్ళు నీ లాగే వున్నారు. వాళ్ళూ, నీ మాదిరిగానే నావలోని ధనరాసుల కోసం బయలుదేరి నట్టుంది. నువ్వూ, ఆ ముఠాకు చెందిన వాడివేనా ?" అని అడిగాడు.

ఆ ప్రశ్నతో కుంభాండుడికి ఏకాక్షి చూసిన మనుషులెవరో తెలిసిపోయింది. తన కన్న ముందుగా కుండలినీ రాజ్యం నుంచి బయలుదేరిన సమరసేనుడూ, అతడి సైనికులూ అయి వుంటారన్న గట్టి నమ్మకం కలిగింది.

"నేను ఆ ముఠాకు చెందిన వాణ్ణి కాను. కాని, వాళ్ళెవరైందీ నాకు తెలుసు. వాళ్ళు ఈ ద్వీపం చేరారని తెలిసే, వాళ్ళ అంతం చూసేందుకు వచ్చాను. ధనాశా పరులైన ఆ ద్రోహులు తప్పక ఆ నావ కోసం వెతుకుతుంటారనే, నేను యిటు వచ్చాను. దారిలో మీరు తారసపడ్డారు," అన్నాడు కుంభాండుడు నిజాన్ని దాచి పెట్టుతూ.




వాళ్ళ సంభాషణ వింటున్న చతుర్నేత్రుడు యిదే మంచి సమయమనుకుని, "ఉలూకా ! నరవానరా !" అంటూ రాతి వెనక నుంచి బయటికి వస్తూ సమరసేనుణ్ణి హెచ్చరించాడు. ఆ వెంటనే సమరసేనుడూ, సైనికులూ బాణాలు ఎక్కుపెట్టి, కుంభాండుడి మీదా, ఆటవికుల మీదా బాణవర్షం కురిపించారు.

ఉలూకా, అన్న కేక వింటూనే ఏకాక్షి నివ్వెరపాటు చెంది, చుట్టూ కలయ చూశాడు. అప్పటికే బాణాలు తాకిన కొందరు ఆటవికులు అరుస్తూ కింద పడిపోయారు. కుంభాండుడు వున్నచోటు

నుంచి ఒక్క గంతువేసి, కొండ దిగువకు పరిగెత్తసాగాడు.

అలా ప్రాణభయంతో పారిపోతున్న ఆటవికులనూ, కుంభాండుణ్ణీ; సమర సేనుడూ, సైనికులూ వెంబడించారు. చీకటివల్ల సైనికులకు బాణాలను గురిగా కొట్టే అవకాశం కలగటం లేదు. కుంభాండుడు కత్తి ఝళిపిస్తూ, "ఆగండి, పారిపోకండి!" అంటూ ఆటవికులను సమీకరించేందుకు కేకలు వేస్తున్నాడు.

ఇక్కడ ఉలూకుడి పేరు విని అదిరిపడిన ఏకాక్షి, అంతలోనే స్తిమితపడి, కత్తి తిప్పుతూ ఒకటి, రెండడుగులు ముందుకు వేసి, పళ్లు కొరుకుతూ, "ఒరే, చతురా! ఈ సరికి నువ్వు ఒట్టి వాజమ్మవని తెలిసిపోయింది. మంత్ర తంత్ర విద్యల్లో, లోకంలో నిన్ను మించినవాడు లేడని గర్వపడే నువ్వు యీ తుచ్ఛమానవాధముల బాణాల సహాయంతో నన్ను జయించాలని చూస్తున్నావు. నేను ఉసి కొలిపితే, నీ మిత్రులందరినీ నరిగి పోగు వేసేందుకు యీ ఆటవికులు చాలు," అన్నాడు.

చతుర్నేత్రుడు రెప్పవాల్చకుండా ఏకాక్షికేసి చూస్తూ పూరుకున్నాడు. కొండ కింద కుంభాండుడి కేకలూ, ఆటవికుల అరుపులూ వినబడుతున్నవి. సమర



సేనుడికి ఏదైనా ప్రమాదం కలగవచ్చునేమో అన్న అనుమానం కలిగిందతడికి.

"ఏకాక్షి, నీ వదరుబోతు మాటలకు జవాబు చెప్పే తీరిక నాకు లేదు. అంతే కాక మన భృత్యుల మధ్య జరిగే పోరాటం వల్ల కలిగే ఫలితం కూడా ఏమీ లేదు. నీ కత్తులూ, కఠారులూ నన్నేమీ చేయలేవని, నీకు తెలియంది కాదు. ఆ రోజు వస్తుంది—నువ్వో, నేనో తేలిపోతుంది! అంతవరకూ ఒట్టి మాటలవల్ల కలిగే ప్రయోజనం ఏమీ లేదు," అన్నాడు చతుర్నేత్రుడు.

ఏకాక్షి ఏదో అనబోయేంతలో చతుర్నేత్రుడు తన కుచ్చుటోపీని చేతితో తాకాడు.

మరుక్షణం అతడు సమరసేనుడికీ, కుంభాండుడికీ జరుగుతున్న భయంకరమైన కత్తి యుద్ధం దగ్గిరకు వచ్చాడు. ఒకవైపున ఆటవికులు బరిసెలూ, ఈటెలూ విసురుతూ ముందుకు రావాలని చూస్తున్నారు. సమరసేనుడి సైనికులు తమ బాణాలతో వారిని ముందుకు రాకుండా ఆటంకపరుస్తున్నారు.

ఈ పరిస్థితుల్లో సమరసేనుడూ, కుంభాండుడూ ఆ యుద్ధరంగం మధ్య కత్తులు దూసి పోరాడుతున్నారు. ఆ సరికి చంద్రోదయమై, ఆ ప్రాంతమంతా వెలుగుతో నిండిపోయింది.

చతుర్నేత్రుడు కొంచెం దూరంగా నిలబడి యిప్పుడు ఏమి చేయటమా అని ఆలోచించాడు. కుంభాండుడి రక్షణ కోసం ఏకాక్ష అక్కడికి రాగలడన్న అనుమానం అతడికి కలిగింది. అందువల్ల, అతడు రాకముందే కుంభాండుణ్ణీ, ఆటవికులనూ హతమార్చటం మంచిదనుకున్నాడు. ఒకవేళ యిదిసాధ్యం కాకపోతే, సమరసేనుణ్ణీ, సైనికులనూ ఆ ప్రదేశం నుంచి మరొక సురక్షిత ప్రాంతానికి తీసుకుపోవాలనుకున్నాడు.

చతుర్నేత్రుడు యిలా ఆలోచిస్తున్నంతలో, భయంకరమైన తోడేళ్ళ అరుపులు వినబడినై. వెన్నెలరాత్రిలో ఆహారం కోసం బయలు దేరిన తోడేళ్ళ గుంపొకటి నెత్తురు వాసన పసిగట్టి అటుకేసే వస్తున్నది.

తోడేళ్ళ గుంపు అరుస్తూ కొండరాళ్ళ మీది నుంచి దూకుతూ, పొదల మాటున పరిగెత్తుతూ తమకేసి రావటం అందరూ చూశారు. యుద్ధం చేసి శత్రువులను హతమార్చే లోపల, ఆకలిగొన్న తోడేళ్ళు తమనే హతమార్చగలవని అందరూ భయపడ్డారు. ఆ వెంటనే పోరాడుతున్న ఆటవికులూ, సైనికులూ అక్కడి నుంచి పారిపోసాగారు. సమరసేనుడూ, కుంభాండుడూ కత్తియుద్ధం ఆపి, తమ అనుచరులు పారిపోతున్న దిక్కుకేసి పరుగు ప్రారంభించారు. —(ఇంకా వుంది)





# మాయటద్దం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే శ్మశానం కేసి బయలుదేరాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, ''రాజా, అద్భుతశక్తుల వల్ల ఎంతో లాభం ఉంటుందని అందరూ అపోహపడతారు, కాని ఒక్కొక్కసారి వాటివల్ల తీరని నష్టం జరుగుతుంది. అందుకు నిదర్శనంగా నీకు వజ్రగిరి రాజైన అమరదీపుడి ఉదంతం చెబుతాను, శ్రమ తెలియకుండా విను,'' అంటూ ఇలా చెప్పసాగాడు :

వజ్రగిరి రాజు అమరదీపుడికి ఆదర్శ ప్రభువులాగా రాజ్యం చేసి, అఖండ కీర్తి తెచ్చుకోవాలన్న ఆశ అయితే ఉండేది గాని, అందుకు తగిన సామర్థ్యం గాని, శక్తియుక్తులు గాని లేవు. అయినా అతను కనిపించిన ప్రతి సన్యాసికీ తన ఆశయం

## బేతాళ కథలు



చెప్పి, అందుకు వారేమైనా సహాయపడగలరేమో అనుకునేవాడు. ఏ సన్యాసి గాని, యోగిగాని అమరదీపుడికి ఎలాటి సహాయమూ చేయలేకపోయారు.

కాని ఒకసారి ఎవరో సాధువు అమరదీపుణ్ణి చూడవచ్చి, అతని సేవలు అందుకుని, అతని ఆశయం విని, ఒక అద్దాన్ని అతని చేతికి ఇచ్చి, "రాజా, ఇది అద్భుతశక్తి గల అద్దం. ఇది నీ కింద పని చేసేవాళ్ళమీద అద్భుతమైన నిఘా ఉంచుతుంది. ఇది వెయ్యిమంది వేగుల వాళ్ళ పెట్టు. ఏ సమయంలో గాని నీకు ఎవరి మీదనైనా అనుమానం కలిగినట్టయితే, వాళ్ళను తలచుకుని ఈ అద్దంలోకి చూశావంటే, వాళ్ళు ఏమనుకుంటున్నదీ నీకు వెంటనే తెలిసిపోతుంది. ఈ అద్దం సహాయంతో నువు నీకు కొలువు చేసే వారి అందరి మనస్తత్వాలూ తెలుసుకుని, ఆదర్శప్రాయంగా రాజ్యం చేయవచ్చు," అన్నాడు.

ఆ అద్దం సహాయంతో తాను ఆదర్శప్రాయుడైన రాజుగా చరిత్రప్రసిద్ధి సంపాదించవచ్చుననుకున్నాడు, అమరదీపుడు. అతను ఆ అద్దాన్ని ఎవరికంటా పడకుండా ఒక చోట దాచి, దానిమీద పూర్తిగా ఆధారపడి రాజ్యం చేయసాగాడు. ఇప్పుడతను తన బుద్ధిని ఉపయోగించటం మానేశాడు, మంత్రులను సలహా అడగటం మానేశాడు. లోగడ అతను కొందరిని పూర్తిగా నమ్మి, వారి సలహాలను పాటించేవాడు. కాని ఇప్పుడు అతను ఎవరినీ గుడ్డిగా నమ్మనవసరం లేదు; అందరి ఆలోచనలూ అద్దం బయట పెట్టుతుంది!

మంత్రులకు రాజుగారి ప్రవర్తనలో మార్పు కనబడింది, కాని అందుకు కారణం తెలియలేదు. రాజు ఏదో నిర్ణయాలు చేసి, మంత్రులను అమలు చేయమనేవాడు, కాని వాళ్ళ అభిప్రాయం అడిగేవాడు కాడు. ఎవరికైనా తన నిర్ణయాలు నచ్చనట్టు అనుమానం

తగిలితే, వారేమనుకుంటున్నదీ అద్దంలో కనిపించేది.

అమరదీపుడికి తన ప్రధానమంత్రి అయిన విక్రమసేనుడి మీద అనుమానం కలిగింది. అద్దంలో చూస్తే, విక్రమసేనుడికి తన మీద ఏ మాత్రమూ గురిలేదనీ, తనను పరమ మూఢుడనుకుంటున్నాడనీ అమరదీపుడికి తెలిసిపోయింది. వెంటనే అతను నేరారోపణా, విచారణా లాంటివి ఏమీ లేకుండా, తన ప్రధానమంత్రిని కారాగృహంలో పెట్టించాడు.

ఇది జరిగినాక సహజంగా రాజుగారి ఉద్యోగులలో చాలామందికి రాజుగారి వివేకం గురించి అనుమానం తల ఎత్తింది. అందరూ రాజుగారి అనుమానానికి పాత్రులయారు. అందరి ఆలోచనలూ అద్దం చూపింది. రాజు అందరినీ చెరసాలలో పెట్టించాడు.

ఈపాటికి దేశంలో చాలా కలవరం ప్రారంభమయింది. ప్రజలలో శాంతి నెలకొల్పే భారాన్ని సేనాపతికి అప్పగించాలనుకుని, అమరదీపుడు ఎందుకైనా మంచిదని, అతన్ని గురించి అద్దం ఏమంటుందో నని చూశాడు. రాజుకు మతిపోయినట్టయింది: సేనాపతి పొరుగు రాజుతో చేతులు కలిపి, అమరదీపుణ్ణి రాజ్యభ్రష్టుణ్ణి చేస్తే ఎలా ఉంటుందని ఆలోచిస్తున్నాడు!

మరుక్షణం సేనాపతి కూడా చెరసాల ప్రవేశించాడు.





తన కొడుకులో అలాటి ఆలోచనలు రేపిన తాను ప్రజలను ఆదర్శప్రభువు లాగా పరిపాలించటం కలలో వార్త! అమరదీపుడు తన కొడుకును పిలిచి, "నాయనా, నాకు రాజ్యం చేయాలని లేదు. రేపు నీకు పట్టాభిషేకం చేసి, నేను అడవులకు పోయి తపస్సు చేసుకుంటాను," అని చెప్పి, ఆ రోజే తను లోగడ కారాగృహంలో పెట్టిన ఉద్యోగుల నందరినీ చెరవిడిపించాడు.

మర్నాడు కాంతిదీపుడు రాజయాడు. అమరదీపుడు మాయ అద్దాన్ని బద్దలు కొట్టి, కాషాయవస్త్రాలు ధరించి, తపస్సు చేసుకునేటందుకు అడవులకు వెళ్ళిపోయాడు.

ఈ పరిణామం చూసి వజ్రగిరిలో సంతోషించనివారు లేరు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, అంత అపూర్వమైన అద్దం అమరదీపుడికి ఎందుకు ఉపయోగపడకపోయింది? అది రాజు లోపమా? అద్దం లోపమా? తనకు ఉపయోగపడని అద్దం తన కొడుకుకైనా ఉపయోగపడుతుందేమో చూడకుండా, రాజు తపస్సు చేసుకోబోతూ ఎందుకు పగలగొట్టాడు? తన కొడుకు దాని సహాయంతో ఆదర్శ ప్రభువులా రాజ్యం చేస్తాడేమో నన్న అసూయతోనా? ఈ అనుమానాలకు

వజ్రగిరి ప్రజలకు ఇంక ఎలాటి సందేహమూ మిగలలేదు. వాళ్ళు తమ రాజుకు పూర్తిగా మతిపోయిందనుకున్నారు. రాజు గారికి మతి చెడిందనీ, అతను రాజ్య పాలనకు పనికిరాడనీ ప్రజలు గట్టిగానే అనసాగారు.

అమరదీపుడికి ఏంచేయాలో పాలుబోక, తన కొడుకు సలహా తీసుకుందామనుకున్నాడు. వాడి ఆలోచనలు అద్దంలో స్పష్టంగా తెలిశాయి! తన తండ్రిని ఎవరిచేతనైనా హత్య చేయించటమా, తానే చెరలో పెట్టించి రాజ్యాభిషేకం చేసుకోవటమా, ఏది మేలని కాంతిదీపుడు తీవ్రంగా ఆలోచిస్తున్నాడు.

సమాధానాలు తెలిసి కూడా చెప్పక పోయావో నీ తల పగిలిపోతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''ఆ అద్దంలో ఏ అద్భుతశక్తి ఉన్నప్పటికీ, ఆదర్శ ప్రాయంగా రాజ్యపాలన చేసేటట్టు తోడ్పడే శక్తి మాత్రం లేదు. అది మనుషుల ఆలోచనలను తెలుపుతుంది. రాజు తనకు ఎవరిమీదనైనా అనుమానం కలిగినప్పుడే అద్దంలో వారి ఆలోచనలు చూస్తాడు. సహజంగా అవి రాజుకు వ్యతిరేకంగానే ఉంటాయి; ఏ కారణమూ లేక రాజు ఎవరినీ శంకించడు గద! పోతే, మామూలు సమయాలలో రాజోద్యోగులు తమ సొంత సమస్యలు గురించి ఆలోచిస్తారు గాని, రాజుగారికి పరిపాలనలో ఎట్లా సహాయ పడటమా అని ఆలోచించరు. ఆ అద్దం రాజోద్యోగుల శక్తిసామర్థ్యాలను గురించి చెప్పదు, చెప్పలేదు! రాజుకు నిజంగా ఉపయోగపడేవి తన కిందివాళ్ళ శక్తి సామర్థ్యాలు. అది అలా ఉంచి, మనుష్యులకు తాత్కాలిక ప్రేరణల వల్ల కలిగే లక్షలాది ఆలోచనలు ఆచరణలోకి రావు. అవి ఆలోచనలుగానే ఉండిపోతాయి. కాని అవి తనకు విరుద్ధంగా ఉ[illegible]ప్పుడు రాజుకు తనపట్ల అవతలివాళ్ళు ద్రోహం చేసినట్టే అనిపిస్తుంది. మాయ అద్దం అమరదీపుడికి చేసిన పెద్ద ద్రోహం అదే. అది చేసిన చిన్న ద్రోహం ఏమంటే, రాజు సమర్థవంతంగా పాలించటానికి ఏయే మార్గాలు అవలంబించాలో వాటి అన్నిటి స్థానమూ ఆ అద్దం ఆక్రమించుకున్నది. ఫలితం ఏమిటి? అత్యుత్తమ పాలకుడు అనిపించుకోవాలనుకున్నవాడు అద్దం మూలంగా అతి అధమపాలకుడు అనిపించుకున్నాడు. ఆ అద్దం తన కొడుక్కు కూడా అదే గతి పట్టించగలదు. అందుకే దాన్ని పగలగొట్టటం అవసరమయింది,'' అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)





# దేవుడిసొత్తు

రామాపురంలో శ్రీరామనవమి ఉత్సవాలు బాగా జరుగుతాయి. అందుకోసం ఊళ్ళో వాళ్ళంతా చందాలు వేసుకుంటారు. ఆలయ ధర్మకర్తల్లో వైశాఖుడు అనే అతనంటే మిగిలిన వారికి మంచి గురి. ఒక ఏడు వసూలైన డబ్బు వైశాఖుడి వద్ద ఉంచాలని పెద్దలు ఏకగ్రీవంగా నిర్ణయించారు. వైశాఖుడు ఆస్తిపరుడు కాడు గాని, నిజాయితీ పరుడు. ఆ సంగతి అందరికీ తెలుసు.

ఆలయ ధర్మకర్తలలో భద్రుడు అనే ధనికుడు కూడా ఉన్నాడు. దేవుడి సొత్తు తన వద్ద దాచకుండా వైశాఖుడి వద్ద దాచటం భద్రుడికి కొంచెం ఆగ్రహం కలిగించింది. ఆ సంగతి గుర్తించి వైశాఖుడు దేవుడి సొత్తు మూటగట్టి తీసుకుపోయి భద్రుడికి ఇచ్చి, "ఈ డబ్బు నా దగ్గరకన్న నీ దగ్గరనే భద్రంగా ఉంటుంది. దీనితో అవసరం వచ్చేదాకా నీ దగ్గిరే ఉంచు!" అన్నాడు.

ఊళ్ళో వాళ్ళు ఇయ్యకపోయినా, వైశాఖుడు తన పెద్దరికం గుర్తించినందుకు తృప్తిపడి, భద్రుడు, "ఎప్పుడు పనిబడితే అప్పుడు వచ్చి డబ్బు తీసుకు వెళ్ళు!" అన్నాడు.

కాని ఈలోగా అనుకోని అవాంతరం జరిగిపోయింది భద్రుడి కొడుకు వ్యసనపరుడు. జూదం తప్ప వాడి జీవితంలో మరో వ్యాపకం లేదు. వైశాఖుడు తన తండ్రికి ధనం మూట ఇయ్యటం వాడి కంటపడింది. తండ్రి దాన్ని ఎక్కడ దాచినదీ గమనించి, వాడు దాన్ని కాజేశాడు.

రెండు రోజుల అనంతరం ఊరి పెద్దలు సమావేశమై, ఉత్సవాలను గురించి నిర్ణయాలుచేసి, వైశాఖుణ్ణి డబ్బుతెమ్మన్నారు.

బొమ్మిడి అచ్చారావు

వైశాఖుడు భద్రుడి వద్దకు వెళ్ళి డబ్బు అడిగాడు. డబ్బు సంచి మాయమైనట్టు భద్రుడు తెలుసుకుని. అది ఎలా మాయమయినదీ గ్రహించాడు. తన సుపుత్రుడు దాన్ని ఈపాటికి హారతి కర్పూరంలా వెలిగించి ఉంటాడు. తన సొంత సొమ్మునుంచి తీసి ఇయ్యాలి! అది భద్రుడికి ఎంత మాత్రమూ ఇష్టం లేదు. వైశాఖుడు తనకు డబ్బు ఇచ్చినట్టు పత్రం గాని, సాక్ష్యంగాని లేదు.

భద్రుడు తనకు డబ్బు సంగతి ఏమీ తెలియదని వైశాఖుడితో తెగేసి చెప్పేశాడు. వైశాఖుడి గుండెల్లో రాయి పడింది.

ఇప్పుడు పెద్దలకు ఏం సమాధానం చెప్పాలి? ఆ డబ్బు చెల్లించటం తన వల్ల అవుతుందా? చెల్లించకపోతే లోకులు తనను గురించి ఏమనుకుంటారు?

ఏమయినా కానిమ్మని వైశాఖుడు పెద్దలతో జరిగినదంతా చెప్పేశాడు. భద్రుడు పిసినారి అయితే కావచ్చుగాని, పెద్దమనిషిగా అతనికి పేరున్నది. పెద్దలు వైశాఖుడి మాట నమ్మలేదు.

"ఎలాగో డబ్బు రేపటికి సిద్ధంగా ఉంచు!" అన్నారు వాళ్ళు వైశాఖుడితో.

డబ్బు ఇచ్చుకోవలసిరావటంతో బాటు వైశాఖుడు నలుగురిలోనూ అవమానం కూడా పొంది, ఇంటికి వచ్చి చింతలో కూరుకుపోయాడు.

భద్రుడి కొడుకు తాను దొంగిలించిన డబ్బును గురించి తండ్రి అడుగుతాడేమో



నని రెండురోజులు చూశాడు. అప్పటికీ డబ్బు ప్రస్తావన రాకపోవడంతో, ఆ డబ్బు పెట్టి మరిద్దరితో జూదం ఆడి, మిగిలిన ఇద్దరిలో ఒకడికి డబ్బంతా ధార పోశాడు.

భద్రుడి కొడుకు నెత్తిన గుడ్డవేసుకుని ఇంటికి వెళ్ళాడు. కాని గెల్చుకున్న వాణ్ణి మూడో జూదగాడు వదిలిపెట్టక, మంచి మాటలతో వాణ్ణి సారాదుకాణానికి చేర్చి, ఒళ్ళు తెలియనంతగా వాడి చేత తాగించి, వాడి డబ్బు మూట తాను సంగ్రహించి బయలుదేరాడు.

దారిలో వాడికి గస్తీ తిరిగే రక్షక భటులు దూరంగా కనిపించారు. వాళ్ళను చూడగానే జూదగాడు వెనక్కు తిరిగి వేగంగా నడవసాగాడు. గస్తీ వాళ్ళు అనుమానించి, వాడి వెంట పడ్డారు. వాడు పరుగు లంకించుకుని, ఒక వీధి మలుపు తిరుగుతూనే తన వద్ద ఉన్న డబ్బు మూటను ఒక ఇంటి గుమ్మంలోకి విసిరేసి ముందుకు పారిపోయాడు.

వాడు ఆ మూట విసిరేసినది భద్రుడి గుమ్మంలోనే. భద్రుడు రాత్రివేళ దొంగల భయంతో సరిగా నిద్రపోడు. గుమ్మంలో లక్ష్మీదేవి చిందుతొక్కినట్టుగా ఘల్లున డబ్బుల చప్పుడు అయేసరికి, భద్రుడు లేచి వచ్చి, తలుపు తీసి మూట ఎత్తుకున్నాడు.

అదే సమయంలో భటులు ఇంటి ముందుకు వచ్చి మూటను చేత పట్టుకుని వున్న భద్రుణ్ణి పట్టుకున్నారు. తాను దొంగ కాదని భద్రుడు ఎంత చెప్పినా వినిపించుకోక, మర్నాడు న్యాయస్థానంలో మూటతో సహా హాజరుపెట్టారు.

విచారణలో ఆ మూట ఎలా చేతులు మారినదీ బయట పడిపోయింది. భద్రుడి మోసం పెద్దలందరికీ తెలిసి పోయింది. వైశాఖుణ్ణి అనుమానించి నందుకు వాళ్ళు ఎంతగానో నొచ్చుకుని, క్షమాపణ చెప్పుకున్నారు.

భద్రుడికీ, అతని కొడుక్కూ జరిమానా విధించబడింది.



# నిజమైన గొప్పతనం

పూర్వం విదర్భదేశంలో ఒక కోటీశ్వరుడైన వర్తకుడు ఉండేవాడు. అతనికి ఆడపిల్లలు తప్ప మగసంతానం లేదు. అతని భార్య ఒకసారి అతనితో, "ఇంత డబ్బు మూలుగుతున్నది. ఒక్కసారి విందుచేసి ఊళ్ళో అందరినీ పిలవరాదా? అలాగైనా ఒక కొడుకు కలుగుతాడేమో?" అన్నది.

వర్తకుడు అలాగే విందు ఏర్పాటు చేసి ఊళ్ళో ఉన్న యావన్మందినీ ఆహ్వానించాడు. గొప్పగా జరిగిన ఆ విందుకు అందరూ వచ్చారు గాని, రామన్న అనే కట్టెలు కొట్టుకునే వాడు రాలేదు. తరవాత ఆ వర్తకుడు రామన్న కనిపించినప్పుడు ఎందుకు రాలేదని అడిగితే, "అయ్యా, మీరు ఊరందరికీ విందు చేసిననాడు, నా కట్టెలు కొనేవాళ్ళు లేక మా ఇంటిల్లి పాతీ పస్తులు పడుకున్నాం!" అన్నాడు.

"మీరంతా వచ్చి విందు భోజనం తినక పస్తులెందుకు పడుకున్నారు?" అని వర్తకుడు ఆశ్చర్యంగా అడిగాడు.

"ఒక్క పూట మీ ఇంట తిండి తిన్నందుకు బతికినన్నాళ్ళూ మేం మీకు తలవంచాలి! నా రెక్కల కష్టం మీద బతక గలిగిన నేను అలా ఎందుకు చెయ్యాలి?" అన్నాడు రామన్న.

తరవాత వర్తకుణ్ణి నలుగురూ, "ఈ ఊళ్ళో నీ అంత గొప్పవాడు లేడు," అని పొగిడి నప్పుడు, "నా కన్న గొప్పవాడు కట్టెలు కొట్టుకునే రామన్న!" అంటూ వాడన్నమాటలు అంద రికీ చెప్పాడు.

—వి. మనోహర్





# శ్రమఫలితం

ఒక దేశంలో ఒక పేద బ్రాహ్మడుండే వాడు. ఆయన కొక చిన్న ఇల్లూ, చిన్న పెరడూ తప్ప ఇంకేమీ లేదు. అందుచేత ఆయన రోజూ బయటికి వెళ్ళి భిక్షాటన చేసేవాడు. తనకూ తన భార్యకూ సరి పడినంత బియ్యం దొరకగానే ఇంటికి తిరిగివచ్చేవాడు. భార్య ఆ బియ్యం వండేది. పెరట్లో ఏవైనా కూరగాయలు కాస్తే దానితో ఇద్దరూ భోజనం చేసేవారు.

కాలక్రమాన బ్రాహ్మడు పెద్దవాడై పోయాడు. భిక్షాటనకు పోవటం కష్ట మైంది. అప్పుడాయన భార్య ఇలా అన్నది:

"మీరెన్నడూ రేపు గురించి ఆలోచించిన పాపాన పోలేదు. ముందే జాగ్రత్త పడి ఉంటే ఇవాళ మనకీ చిక్కు లేక పోయేది. అయినా ఈ ఊరి రాజు చాలా దానశీలుడంటారు. మీరు వెళ్లి అడగండి. ఆయన మన దరిద్రం తీరుస్తాడు."

బ్రాహ్మడు ఆ ప్రకారమే రాజును చూడబోయి ఆశీర్వచనం చదివాడు. రాజు, "ఏం కావాలో కోరండి!" అన్నాడు.

"అయ్యా, తమరు సంపన్నులు. కాని తమ సంపదలో నేను భాగం అడగను. తాము శ్రమపడి సంపాదించినది తృణమో, పణమో ఇప్పించండి," అన్నాడు బ్రాహ్మడు.

రాజు దగ్గిర చాలా ధనం ఉన్నది గానీ, అందులో ఒక దమ్మిడీ కూడా తాను కష్టించి సంపాదించినది కాదు. ఈ బ్రాహ్మడికేమన్నా ఇవ్వాలంటే తాను కొత్తగా సంపాదించవలసిందే. రాజు బ్రాహ్మడితో, "అయితే రేపు సాయంకాలం కనిపించండి," అన్నాడు.

బ్రాహ్మడు సరేనని వెళ్ళిపోయాడు. మర్నాడు ఉదయమే రాజు మాసిన బట్టలు కట్టుకుని కూలివాడిలాగా బయలు

దేరాడు. ఆయన అలా కొద్ది దూరం వెళ్ళేసరికి వీధిలో ఒక కుమ్మరి కుండలు చేయబోతున్నాడు.

"అయ్యా, నాకేమైనా పని ఇవ్వగలరా?" అని రాజు కుమ్మరిని అడిగాడు.

"పనికేం భాగ్యం? నేను సారె మీద కుండలు చేస్తాను. నువు మట్టి కలుపు. పొద్దుగూకేదాకా పని చేశావంటే నాలుగు రూకలు ఇస్తాను," అన్నాడు కుమ్మరి.

రాజు సరేనన్నాడు. కాని ఆయనకు పని సరిగా చేతకాలేదు. మట్టి తొక్కుతుంటే ఆయన కాళ్ళకు చాలా బాధ కలిగింది. ఇదంతా గమనిస్తున్న కుమ్మరి, "నీ వల్ల కూలిపని ఏమవుతుంది? పద పద! మాట అన్నాను కనక ఇస్తున్నాను. ఇవిగో రూకలు! మళ్ళీ ఎన్నడూ కూలి చేస్తానని రాకు!" అని ఖండలించి రాజును పంపేశాడు.

రమ్మన్న ప్రకారం బ్రాహ్మడు సాయంకాలం రాజును చూడవచ్చాడు. రాజు ఆయన చేతిలో నాలుగు రూకలూ పెట్టి, "ఇదే నా శ్రమఫలితం!" అన్నాడు.

"అదే నాకు పదివేలు, మహారాజా!" అని బ్రాహ్మడు రాజును హృదయపూర్వకంగా ఆశీర్వదించి వెళ్ళిపోయాడు.

తన భర్త రాజుగారి వద్దనుంచి బహుమతులు ఎన్ని బళ్ళమీద తోలించుకు



వస్తాడో అని ఎదురు చూస్తున్న బ్రాహ్మడి భార్య, తన భర్త వట్టి చేతులతో రావటం చూసి, "ఏమండీ? ఏమయింది? రాజు మళ్ళీ వాయిదా వేశాడా?" అని అడిగింది.

"లేదు, దానం తీసుకునే వచ్చాను. ఇవిగో, నాలుగు రూకలు!" అంటూ బ్రాహ్మడు రూకల్ని భార్య చేతిలో పెట్టాడు.

వాటిని చూడగానే బ్రాహ్మడి భార్యకు మండిపోయింది. "కాశీ వెళ్ళి కొంగయీక తెచ్చినట్టు, రాజు దగ్గిర కూడా ఈ యాయవారం డబ్బులేనా తెచ్చేది?" అంటూ ఆమె ఆ నాలుగు రూకలూ పెరట్లోకి విసిరివేసింది.

అప్పటికే చీకటి పడిపోయింది. అందు చేత బ్రాహ్మడు వాటికోసం మర్నాడు తెల్లవారి వెతుకుదామనుకున్నాడు.

మర్నాడు ఎంత వెతికినా బ్రాహ్మడికి ఆ రూకలు దొరకలేదు. కాని నాలుగు అపూర్వమైన చిన్న మొక్కలు మాత్రం కనిపించాయి.

చూస్తుండగానే ఆ నాలుగు మొక్కలూ అందంగా ఏపుగా పెరిగాయి, త్వరలోనే వాటికి కాయలు కాశాయి. బ్రాహ్మడూ, భార్యా ఆ కాయలు కోసి, ఏ రుచిగా ఉంటాయో చూతామని వాటిని తరిగేసరికి కాయల నిండా ముత్యాలు కనిపించాయి! ఆ పేద దంపతులు తమ కళ్ళను తామే నమ్మలేకపోయారు. ఆ ముత్యాలను తీసుకుపోయి చూపితే వర్తకులు అవి మేలురకం ముత్యాలే అన్నారు.

ఇంత కాలానికి ఆ పేద దంపతుల దరిద్రం తీరిపోయింది. నాలుగు చెట్లూ ఎడతెగకుండా కల్పవృక్షాలలాగా పళ్ళు కాస్తూండటం చేత వారు ప్రతి రోజూ ఆ పళ్ళను ఊళ్ళో అందరికీ దానం చెయ్యసాగారు.

కొద్దికాలంలోనే ఆ వూరి రాజుకు ఈ బ్రాహ్మడి సంగతి తెలిసింది. శ్రమదానం యాచించి నాలుగు రూకలు మాత్రమే పట్టుకుపోయిన ఈ బ్రాహ్మడికి ఇంతలోనే ఇలా సిరి ఎత్తుకోవటానికి కారణం రాజుకు బోధపడలేదు. ఆయన ఆ విషయం తెలుసుకుందామని బయలుదేరి బ్రాహ్మడి ఇంటికి వచ్చాడు.

"అయ్యా, ఆనాడు మీరిచ్చిన నాలుగు రూకలూ నేను ఖర్చు చేయనేలేదు. నా భార్యకిస్తే ఆమె అలిగి వాటిని పెరట్లో పారేసింది. మర్నాడు అవి దొరకలేదు గాని ఈ వింత చెట్లు మొలిచాయి. వీటి నుంచి మా తరతరాల దరిద్రం తీరిపోయింది," అన్నాడు బ్రాహ్మడు.

శ్రమఫలితం విలువ రాజుకు అర్థమయింది. ఆ నాటినుంచి తానేగాక తన ప్రజలంతా శ్రమఫలితంపై జీవించాలని రాజు శాసనం చేశాడు.





# పంచాయుధుడు

బ్రహ్మదత్తుడు కాశీరాజ్యాన్ని పాలించే కాలంలో, బోధిసత్వుడు యువరాజుగా జన్మించాడు. నామకరణ మహోత్సవం నాడు, దేశదేశాల నుంచి దైవజ్ఞులు వచ్చారు. వాళ్ళు రాజుతో, ''మహారాజా, ఈ పసివాడు చాలా గొప్ప జాతకుడు. ఐదు ఆయుధాలతో ప్రపంచాన్నంతా జయించగల గొప్ప పరాక్రమశాలి,'' అని జోస్యం చెప్పి, పిల్లవాడికి, పంచాయుధుడు అని పేరు పెట్టారు.

కొంత కాలం గడిచింది పిల్లవాడికి ప్రాజ్ఞత రాగానే, అతణ్ణి గాంధర్వదేశంలోని తక్షశిలా నగరానికి, మహాపండితులైన గురువుల వద్ద సమస్త విద్యలూ నేర్చుకునేందుకు పంపారు.

పంచాయుధుడు తక్షశిలలో కొంత కాలం చదువుకుని, సకల విద్యాపారంగతుడయ్యాడు. గురుకులం నుంచి సెలవు తీసుకునేటప్పుడు, గురువు శిష్యుణ్ణి దీవించి, ఐదు ఆయుధాలను ప్రసాదించాడు. గురువుగారి అనుజ్ఞతో కాశీరాజ్యానికి బయలుదేరాడు, పంచాయుధుడు.

దారిలో పంచాయుధుడు ఒక మహారణ్యాన్ని దాటవలసి వచ్చింది. అతడు అరణ్యమార్గాన నడుస్తూండగా, కొందరు మనుషులు ఎదురుపడి, ''చూడబోతే చాలా చిన్నవయసు వాడివి. ఈ మహారణ్యంలో రోమాంచుడనే రక్కసుడు విహరిస్తూంటాడు. వాడి కంట బడితే, నీ ప్రాణాలు దక్కవు. అందువల్ల, యీ మార్గం వదిలి, మరొక మార్గాన అరణ్యం దాటడం క్షేమం,'' అని సలహా యిచ్చారు.

ఈ మాటలేవీ పరాక్రమశాలి అయిన పంచాయుధుడు పట్టించుకోలేదు. అతడు ఆ అరణ్యమార్గాన్నే నడవసాగాడు.

మార్గంలో ఒకచోట, తాటిచెట్టు ప్రమాణంలో వున్న రాక్షసుడు రోమాంచుడు ఎదురయ్యాడు.

ఈ రోమాంచుడు చూడ భయంకరుడుగా వున్నాడు. పెద్ద తల, నిప్పులు చెరిగే కళ్ళు, ఏనుగు కున్నట్టు నోటిలో పొడవాటి రెండు దంతాలు, శరీరం నిండా ఎలుగుబంటిలా పొడవైన రోమాలు!

రాక్షసుడు, పంచాయుధుడి దారికి అడ్డుగా నిలబడి, ''ఎవడివిరా, నువ్వు? ఎక్కడికి పోతావు? ఆగు, ఆగు! నిన్నిదే మింగబోతున్నాను,'' అంటూ హుంకరించాడు.

పంచాయుధుడు ఏ మాత్రం భయపడక, ''రాక్షసరాజా, తెలిసే నేనీ అరణ్యంలో ప్రవేశించాను. జాగ్రత్త, దగ్గరకు రాకు,'' అని, బాణం ఎక్కుపెట్టి, రాక్షసుడి పైకి వదిలాడు.

బాణం రివ్వుమంటూ పోయి, రాక్షసుడు ధరించిన జంతుచర్మాలకు తగిలింది. వాడు ఏ మాత్రం గాయపడలేదు. ఈసారి పంచాయుధుడు బాణం వెంట బాణాన్ని వాడి మీద ప్రయోగించాడు. ప్రయోజనం లేకపోయింది. ఆఖరుసారిగా విషం పూసిన బాణాలను వదిలాడు. అవీ రాక్షసుడికి ఎలాంటి హానీ కలిగించలేక పోయినై.

రాక్షసుడు యీ సారి మరింత పెద్దగా హుంకరించి, పంచాయుధుడి మీదికి వెళ్ళాడు. పంచాయుధుడు తన ఖడ్గం



చూసి, రాక్షసుడి మీదికి విసిరాడు. వాడు చలించలేదు.

అప్పుడు పంచాయుధుడు, రాక్షసుడితో, "నీ మూఢత్వం కొద్దీ నన్ను గుర్తించలేకుండా వున్నావు. నా పేరు పంచాయుధుడు. నేనీ అరణ్యం ప్రవేశించేటప్పుడు, కేవలం నా ఆయుధాలను నమ్ముకునే ఆ పని చేయలేదు," అంటూ పిడికిలి బిగించి, రోమాంచుణ్ణి ఒక్క పోటు పొడిచాడు. ఆ దెబ్బకూ వాడు చలించలేదు.

రాక్షసుడు పెద్దగా నవ్వి, "కుర్రవాడా, నీ వాలకం చూస్తూ వుంటే, నువ్వు మామూలు మనిషివిలా తోచడం లేదు. ప్రళయభయంకరుడనైన నన్నే ఢీకొనటానికి సాహసించావు. మానవులు నా రూపం చూసే హడలెత్తిపోతారే, మరి నీకు ప్రాణభయం లేకపోవడానికి కారణం ఏమిటి?" అని అడిగాడు.

"భయం ఎందుకు? పుట్టుకతో పాటే మరణం వుంటుంది. అంతే కాక, నా శరీరంలో వజ్రసమానమైనటువంటి ఖడ్గం ఒకటి వున్నది. అదే జ్ఞానం! నన్ను నీవు ఒకవేళ మింగటమే జరిగితే, ఆ ఖడ్గం నిన్ను, నిలువునా చీల్చేస్తుంది," అన్నాడు.

రాక్షసుడు ఒకటికి రెండు క్షణాలు ఆలోచిస్తూ వూరుకుని, "కుర్రవాడా, నువ్వనే దాంట్లో ఏదో సత్యం వున్నట్టు నాకు అనుమానం కలుగుతున్నది. ఏది



ఏమైనా, నువు నిర్భయుడివి, శూరశిఖా మణివి. నీ వంటి వాణ్ణి నేను మింగ గలిగినా జీర్ణించుకోవటం సాధ్యం కాదు. ఇక స్వేచ్ఛగా, నీ దారిన నువ్వు వెళ్ళు," అన్నాడు.

పంచాయుధుడుగా జన్మించిన బోధి సత్వుడు, రాక్షసుణ్ణి దీవించి, "నన్ను వదిలావు, బాగానే వున్నది. నీ సంగ తేమిటి? నువు ఎన్ని జన్మల నుంచో దుర్మార్గపు పనులు చేస్తూ, యిలా నికృష్టపు బతుకు, బతుకుతున్నావు. అజ్ఞాన మనే అంధకారంలో కొట్టు మిట్టాడు తున్నావు. ఎంతకాలం జరిగినా, నీ గతి యింతే!" అన్నాడు.

"అయితే, మహానుభావా, యీ అజ్ఞానం నుంచి బయట పడేందుకు నేనేం చేయాలి?" అని అడిగాడు రాక్షసుడు చేతులు జోడించి.

"నువ్వీ అరణ్యమార్గాన చేరి, దారే పోయే మానవులను చంపి తింటూ, పాపం పెంచుకుంటున్నావు. ఆ పాపం పెరిగిన కొద్దీ, నీవు రాక్షసజన్మలే ఎత్తి, యాతనలు అనుభవించడమే కాని, ఎన్నటికీ నీకు మోక్షం లేదు. నీకు ఉత్తమమైన మానవ జన్మ కావాలంటే, పాపం చేయకు," అని బోధిసత్వుడు హితవు చెప్పాడు.

ఆ తరవాత బోధిసత్వుడు, రాక్షసుడికి మానవులు మేలు పొందేందుకు అనుసరించ వలసిన ఐదు మహా సూత్రాలను గురించీ, మానవులను అధములుగా చేసే పంచ తంత్రాలను గురించీ విప్పి చెప్పాడు.

ఆ నాటి నుంచీ రోమాంచుడు తన రాక్షసకృత్యాలు మాని వేయడమే కాకుండా, అరణ్యంలో ప్రయాణించే బాటసారులకు తన ఇంట ఆతిథ్యం యిస్తూ, గొప్ప ధర్మబుద్ధి గలవాడని పేరు తెచ్చుకున్నాడు.

ఆ విధంగా బోధిసత్వుడి ధర్మబోధల వల్ల, మహా భయంకరుడైన రాక్షసుడు సన్మార్గవర్తనుడయ్యాడు.





# ఖారవేలుడు

కళింగరాజ్య ముఖ్య నగరంలో, ఒకప్పుడు మహావీరజినుడి గొప్ప విగ్రహం వుండేది. అది ప్రజలకెంతో పవిత్రమైనది. నందవంశపువాడైన మగధ రాజు కళింగరాజ్యం మీద దాడి చేసి, మహావీరుడి విగ్రహాన్ని తరలించుకుపోయాడు.

ఆ తరవాత కొద్ది కాలానికే అశోకుడు కళింగపై దాడి చేశాడు. కళింగ ప్రజలు అశోకుడి సైన్యాలను ఎదిరించి, ఎందరో వీరమరణంపాలయ్యారు. ఆ యుద్ధంలో జరిగిన రక్తపాతం చూసి, అశోకుడికి హృదయపరివర్తనం కలిగింది. కాని, కళింగప్రజల జీవితం ఆ యుద్ధంతో ఛిన్నాభిన్నమైపోయింది.





మౌర్యసామ్రాజ్యంలో ఐదవ రాష్ట్రంగా వుండిపోయిన కళింగ, అశోకుడి మరణానంతరం తిరిగి స్వతంత్రమైంది. మరి కొన్నాళ్ళకు పెనుతుఫానులకు గురి అయి, కళింగలోని గ్రామాలూ, పట్టణాలతో పాటు రాజధానీ నగరం కూడా దెబ్బతిన్నది.



రాజ్యం యిలాంటి యిక్కట్లలో వున్న తరుణంలో ఖారవేలుడు అనే యువ రాజు సింహాసనానికి వచ్చాడు. అతడు తన శక్తిసామర్థ్యాలను ఉపయోగించి, రేబవలు కష్టించి, యీ నాటి భువనేశ్వరం సమీపాన కొత్త రాజధానిని నిర్మించాడు. అంతే కాక, వ్యవసాయ, వాణిజ్యాలను ప్రోత్సహించాడు.

ప్రజలలో ఆత్మవిశ్వాసం, స్వాభిమానం పునరుద్ధరించేందుకు, ఖారవేలుడు లలిత కళలను ప్రోత్సహించాడు. నాట్య, గానాల్లాంటివి ప్రజలకు ఎంతో ఆనందాన్ని కలిగించినవి. ఎన్నో సంవత్సరాల ఈతిబాధల తరవాత, ప్రజలు తిరిగి సంతోష సౌఖ్యాలు అనుభవించారు.





ఖారవేలుడు యింతటితో సంతృప్తి పడలేదు. ప్రజల్ని మరింత చైతన్యవంతులుగా చేయాలంటే, తానేదో ఒక ఘనకార్యం సాధించాలనుకున్నాడు. అందుకు ముందుగా బలమైన గొప్ప సైన్యాన్ని తయారుచేశాడు. తన సైనిక శక్తిపై పూర్తి విశ్వాసం కలిగాక, కార్యరంగంలోకి దిగాడు.

మగధరాజ్యంపై దాడికి ఖారవేలుడు సమాయత్తమయాడు. మహావీరజినుడి విగ్రహాన్ని తిరిగి తన రాజధానీ నగరానికి తేవటం ద్వారా, లోగడ జరిగిన అవమానాన్ని తుడిచిపెట్ట దలిచాడు. కళింగసైన్యం మగధరాజధాని రాజగృహం వైపుగా దాడి బయలు దేరింది.





అదే సమయంలో డిమిట్రియస్ అనే గ్రీకురాజు సైన్యాలు కూడా, రాజగృహం మీద దాడికి వస్తున్నవి. మగధరాజు, తన రాజధానిపై రెండు వైపుల నుంచి దాడి రాబోతున్నదని తెలిసి భయపడిపోయాడు.

ఖారవేలుడు తన సైన్యాలతో మగధరాజ్యపుటెల్లలలోవిడిశాడు. డిమిట్రియస్ పంపిన ఒక దూత, ఖారవేలుడి దగ్గిరకు వచ్చి, తమ రాజు అతడికి జయం కోరుతున్నట్టు చెప్పి; రాజగృహంపై చెరొక వైపు నుంచీ దాడి చేయటం బావుంటుందని సూచించాడు.





డిమిట్రియస్ వ్యూహం విజయానికి దగ్గరదారి అని, ఖారవేలుడు గ్రహించాడు. కాని, విదేశీయుడికి స్వదేశంలో రాజ్యభాగాన్ని జయించే అవకాశం యివ్వగూడదన్న నిర్ణయానికి వచ్చాడు. అతడు గ్రీకులపై యుద్ధం ప్రకటించి. వాళ్ళను దూరంగా తరిమివేశాడు.

ఆ తరవాత ఖారవేలుడు అనేక రాజ్యాలు జయించి, భారతదేశంలోని పెక్కు ప్రాంతాలకు చక్రవర్తి అయాడు. అతడు మగధపై దాడి ప్రారంభించే సరికి, మగధరాజు లోగడఎత్తుకుపోయిన మహావీరజినుడి విగ్రహాన్ని, స్నేహపూర్వకంగా ఖారవేలుడి పరం చేశాడు. ఈ విధంగా మగధ, కళింగ సేనల మధ్య యుద్ధం నివారింపబడింది.





ఖారవేలుడు తన పరిపాలనా కాలంలో జైనమతాభివృద్ధికి ఎంతగానో కృషి చేశాడు. జైనపండిత పరిషత్తును ఏర్పాటు చేశాడు. జైనసన్యాసుల నివాసం కోసం, భువనేశ్వర సమీపంలోని ఉదయగిరి, ఖండగిరి పర్వతాలలో గుహలు నిర్మింపచేశాడు.




# కోదండరాముడు

నారాయణపట్నంలో ఉండే భోగరాజు వ్యాపారంలో లక్షలకు లక్షలు గడించాడు. లాభాలు వచ్చాయి గనక, తాను అనుకున్న ప్రకారం కోదండరాముడికి మొక్కు చెల్లించటానికి నూరు బంగారు కాసులు చేయించి, భార్యతో సహా ప్రయాణం కావటానికి ముహూర్తం నిశ్చయించుకున్నాడు.

తెల్లవారితే ప్రయాణమనగా ఆ రాత్రి ఇంట్లో దొంగలు పడి, ప్రయాణానికి సర్దుకున్న పెట్టె కాస్తా ఎత్తుకుపోయారు. భోగరాజూ, అతని భార్యా, కొడుకు సన్యాసిరాజూ ఆ పెట్టె కోసం ఇల్లంతా వెతికిన మీదట, పెరటితలుపు తెరిచి ఉన్నట్టు తెలిసి, దొంగతనం జరిగినట్టు స్పష్టమయింది.

దొంగతనం గురించి కొత్వాలుకు ఫిర్యాదు చేశారు కాని దొంగల ఆచూకి తెలియరాలేదు.

దేవుడికి చేరవలసిన బంగారుకాసులు పోయాయని భోగరాజు బాధపడ్డాడు. మళ్లీ కాసులు తయారుకావాలి గనక ప్రయాణం వాయిదాపడింది. ఈలోగా ఒకనాడు ఎవరో వచ్చి, భోగరాజుకు ఒక ఉత్తరం ఇచ్చారు. అందులో ఇలా ఉన్నది:

"పూజ్యులూ, దాతలూ అయిన భోగరాజుగారికి; తమ దయవల్ల మాఅమ్మాయి ఇందిరకు వచ్చే ఆదివారం వివాహం నిశ్చయమయింది. ఈ సందర్భంలో తమరు చేసిన మేలు ఎన్నటికీ మరచిపోలేము. తమరు ఆ రోజుకు వచ్చి, వధూవరులను ఆశీర్వదించి, మమ్మల్ని ఆనందపరచ గోరుచున్నాము-

ఇట్లు,

సింహాచలం, సీతమాంబాపురం."

ఈ ఉత్తరం చదువుకుని భోగరాజు చాలా ఆశ్చర్యపడ్డాడు. ఉత్తరం తెచ్చిన

ఎన్. వి. ఆర్. సత్యనారాయణమూర్తి

వాడు గాని, దాన్ని పంపిన సింహాచలం అనే అతను గాని తనకు తెలిసినవాళ్ళు కారు. తాను అతనికి చేసిన సహాయం ఏమిటో తెలియలేదు. దీని సంగతి ఏమిటో అంతుతేల్చుకోవాలని, భోగరాజు ఆది వారంనాడు సీతమాంబాపురం వెళ్ళాడు.

సింహాచలం భోగరాజును ఎంతగానో గౌరవించి, "సొమ్ము సర్దుబాటు చెయ్య లేక, పెళ్ళి ఆగిపోతుందేమోనని భయ పడుతూ నిస్సహాయ స్థితిలో ఉండగా తమరు దేవుడిలా డబ్బు పంపించి ఆదు కున్నారు. మీ మేలు జన్మజన్మలకూ మరిచిపోలేను," అన్నాడు.

"మీకు డబ్బు తెచ్చి ఇచ్చినది ఎవరు ?" అని భోగరాజు అడిగాడు.

"ఎవరో కోదండరాముడట! 'ఈ డబ్బుతో తమ కుమార్తె వివాహం జరిపించండి. దీన్ని నారాయణపట్నం భోగరాజుగారు పంపారు,' అని చెప్పాడు," అన్నాడు సింహాచలం.

తన ఆశ్చర్యాన్ని తనలోనే దాచుకుని, పెళ్ళికాగానే భోగరాజు తిరిగివచ్చేశాడు.

మర్నాడే విక్రమపురం నుంచి కొందరు రైతులు వచ్చి, "తమరు తవ్వించిన నుయ్యికి తమ చేతుల మీదుగానే ప్రారం భోత్సవం జరగాలి!" అని భోగరాజును నిర్బంధించారు.

భోగరాజు వాళ్ళ కేసి ఆశ్చర్యంగా చూశాడు. "అప్పుడే మరిచారా, బాబూ? నీరులేక అగచాట్లు పడుతున్న మా గ్రామ



ప్రజలకు మంచినీటి బావి తవ్వకానికిగాను కోదండరాముడి ద్వారా డబ్బు పంపించారు కారా!'' అన్నారు రైతులు.

మళ్ళీ కోదండరాముడు!

భోగరాజు తన ఆశ్చర్యాన్ని బయట పడనీయక, ఏదో జ్ఞాపకం వచ్చినట్టు అభినయించి, సందర్భోచితంగా వాళ్ళతో ఏదో అని, వాళ్ళను పంపించేశాడు.

తరవాత అతను విక్రమపురం వెళ్ళి, అక్కడ తవ్విన బావికి ప్రారంభోత్సవం చేసి, గ్రామప్రజల ప్రశంసలు అందుకుని తిరిగివచ్చాడు.

తాను మొక్కుబడి తీర్చేటందుకు చేయించిన కాసులు పోయినందుకు కనికరించి, సాక్షాత్తూ కోదండరాముడే తన పేరుతో ఈ పనులు చేస్తున్నాడేమోనని భోగరాజుకు అనుమానం కలిగింది.

ఇంకొకనాడు ఎవరో అపరిచితుడు వచ్చి, భోగరాజుకు నమస్కరించి, ''అయ్యా, నా పేరు నాగరాజు. నేను ఒక భయంకరమైన వ్యాధితో బాధపడుతూ ఉంటే, దానికి ఔషధం తయారుచెయ్యటానికి బంగారం కావాలన్నారు—రామాచారిగారు. నేనా బీదవాణ్ణి! బంగారం ఎక్కడినుంచి తేగలను? నా చావు ఖాయం అని అందరూ అనుకున్న సమయంలో, కోదండరాముడు అనే అతను వచ్చి, భోగరాజుగారు నీ కోసం పంపించారంటూ కొంత బంగారం ఇచ్చి వెళ్లాడు. రామాచారిగారు దాన్ని పుటం పెట్టి,



ఔషధం తయారుచేసి, నా రోగం నయం చేశారు! తమ దయ వల్ల బతికి బయట పడ్డాను!'' అన్నాడు.

భోగరాజు అతనితో తగిన రీతిగా మాట్లాడి, కొన్ని పళ్ళు కూడా ఇచ్చి పంపేశాడు.

అప్పుడే స్వర్ణకారుడు చిట్టిబాబు వచ్చి, నూరు బంగారుకాసులు తెచ్చి, అవి తయారుచేసినందుకు మజూరీ పుచ్చుకుని వెళ్ళాడు.

భోగరాజు మొక్కు తీర్చుకునేటందుకు మళ్ళీ ప్రయాణ సన్నాహం ప్రారంభించాడు. ఆ సమయంలో, పక్కగదిలో అతని కొడుకు సన్యాసిరాజు ఎవరితోనో ఇలా అనటం వినపడింది:

''రాజూ, నువు చెప్పినట్టు కోదండ రాముడుగా నటించాను. మా నాన్న, నిజంగా దేవుడే తనకు పేరుప్రతిష్ఠలు తేవటానికి, తన భక్తికి మెచ్చి, అలా చేశాడనుకుంటున్నాడు, పాపం! మొత్తంమీద మా నాన్నను మోసం చేసి, మనం సంపాదించిన బంగారు కాసులు మంచి పనులకు వినియోగమయాయి!''

తన కొడుకు మాట్లాడుతున్నది వాడి స్నేహితుడు ఆనందుడితోనని భోగరాజు గ్రహించాడు.

అతను మర్నాడు తన కొడుకు సన్యాసి రాజును పిలిచి, అతనికి నూరు బంగారు కాసులు గల సంచీ ఇస్తూ, ''ఒరే, నేను మరి మొక్కు చెల్లించదలచుకోలేదు. ఈ బంగారు కాసులు కూడా నువే సద్వినియోగం చెయ్యి. నేను వినేలాగా నిన్నువూ, ఆనందుడూ మాట్లాడిన మాటల వల్ల విషయం తెలుసుకున్నాను. కోదండ రాముడికి నేనిచ్చే కాసులు సద్వినియోగం అవుతాయో, లేదో నేను చూడలేను. కాని మీరు చేసిన మంచి పనులు నా మనస్సుకు ఆనందాన్నీ, సంతృప్తినీ కలిగించాయి,'' అన్నాడు.

స్వతహాగా సంస్కారవంతుడైన తన తండ్రిలో కలిగిన మార్పుకు సన్యాసి రాజు ఎంతో సంతోషించాడు.



# అసలు కారణం

భీమన్న బీదవాడు. అతను గుత్తవ్యాపారుల దగ్గిర పళ్ళుకొని, ఇంటింటికీ తిరిగి వాటిని అమ్ముకుని, ఆ వచ్చిన లాభంతో తన పొట్టపోసుకునే వాడు. అతని వాడుకదార్లలో ఒకడైన శరభయ్య, కొద్దిపాటి లాభం కోసం భీమన్న రోజూ పడుతున్న పాట్లు చూసి జాలిపడి, "అంగడి తెరిచి, కాలుకదలకుండా వ్యాపారం చెయ్యరాదా?" అని అడిగాడు.

అందుకు చాలా డబ్బు కావాలన్నాడు భీమన్న. శరభయ్య వాడికి వెయ్యిరూపాయలు అప్పు పెట్టి, దానితో పళ్ళదుకాణం పెట్టమనీ, తన బాకీ తాపీగా తీర్చవచ్చుననీ అన్నాడు. వెయ్యి రూపాయలతో పళ్ళదుకాణం పెట్టేకన్న, కిరాణాకొట్టు పెట్టితే ఎక్కువ లాభం వొస్తుందని భీమన్న భార్య అన్నది. భీమన్న తన భార్య చెప్పినట్టు చేసి, లాభం తీయకపోగా, తన పెట్టుబడి కూడా పోగొట్టుకున్నాడు.

వాడు శరభయ్యకు జరిగిన సంగతి చెప్పి, "నష్టజాతకుణ్ణి! నా తలరాత ఇదే! మళ్ళీ పళ్ళబుట్ట నెత్తిన పెట్టుకుని ఇల్లిల్లూ తిరుగుతాను!" అన్నాడు.

"నష్టజాతకమూ కాదు, తలరాతా లేదు! నీకు తెలిసిన పళ్ళవ్యాపారం చేసుకోక, తెలియని కిరాణావ్యాపారం చేసి నష్టపోయావు. ఇంకో వెయ్యి ఇస్తాను, పళ్ళదుకాణం పెట్టుకో!" అన్నాడు శరభయ్య.

భీమన్న ఈసారి పళ్ళదుకాణం తెరిచి, నిజంగానే బాగుపడ్డాడు.

—రుద్రరాజు నారాయణమూర్తి.






రామనాథమూ, రంగనాథమూ మంచి స్నేహితులు. వాళ్ళు ఇరుగు, పొరుగు వాళ్ళు కూడా. ఇద్దరి కుటుంబాలూ ఒకే కుటుంబం లాగా కలిసిపోయాయి.

రామనాథం చాలా చాదస్తం మనిషి. శకునం చూడకుండా ఎక్కడికీ బయలు దేరేవాడు కాడు. శకునం మంచిదైతే ఇబ్బంది లేదు గాని, మంచి శకునం కాకపోతే అవసరమైన పని కూడా పాడు చేసుకుని, గుమ్మం కదిలేవాడు కాడు.

ఈ పద్ధతి రామనాథం భార్యకు నచ్చేది కాదు. శకునం మంచిదైనా, చెడ్డదైనా జరగవలసినది జరగకమానదని ఆవిడకు గట్టినమ్మకం.

అందుచేత ఆమె తన భర్తను మార్చే ప్రయత్నం రంగనాథానికి అప్పజెప్పింది. రంగనాథం ఒక ఎత్తు ఆలోచించి, దాన్ని రామనాథం భార్యకు వివరించి చెప్పాడు.

ఆ రాత్రి రామనాథానికి వడ్డన చేస్తూ, అతని భార్య, "రంగనాథం అన్నయ్య గారికి మీరు ఇయ్యవలసిన వంద రూపాయలూ యింతకుముందే ఇచ్చేశానండీ!" అన్నది మెల్లగా.

రామనాథం ఆశ్చర్యంగా, "ఏం వంద రూపాయలు? ఎందుకు ఇయ్యాలి?" అని అడిగాడు.

"అదేనండీ! నిన్న రంగనాథం అన్నయ్యగారు ఒక ముఖ్యమైన పని మీద బయలుదేరుతూంటే, మీరు ఎదురు వచ్చారుట. ఆయనకు వెళ్ళిన పని జరగకపోగా, దారిలో నూరు రూపాయలు పోయాయట! మీ శకునం మంచిదిగదా అనుకుని బయలుదేరినందుకు ఆయనకు డబ్బు నష్టం జరగటం వల్ల, ఆ నష్టానికి మీరే పూచీదారు అనీ, అతనికి మీరు వంద రూపాయలు బాకీపడ్డారనీ చెప్పి,

మరువాడ భానుమూర్తి

ఆ డబ్బు తీసుకున్నారండీ,'' అన్నది రామనాథం భార్య.

అంతా విని రామనాథం ఆవేశపడుతూ, ''ఎంత మోసం! ఎంత మోసం! ఇప్పుడే వెళ్ళి సంగతి ఏమిటో తేలుస్తాను!'' అంటూ రంగనాథం ఇంటి మీదపడ్డాడు.

తన పథకం పారిందని లోలోపల సంతోషిస్తూ రంగనాథం, ''కూర్చో, రామం! ఇలా వచ్చావేం?'' అన్నాడు.

''నేనిప్పుడు కూర్చోడానికి రాలేదు, విషయం తేల్చుకుందామని వచ్చాను,'' అన్నాడు రామనాథం అగ్గి మీద గుగ్గిలం అయిపోతూ.

''ఏ విషయం?'' అని రంగనాథం అమాయకంగా అడిగాడు.

''అదే! నా భార్య దగ్గిర ఏవో మాయ కబుర్లు చెప్పి, నువు తీసుకున్న వంద రూపాయల విషయం!'' అన్నాడు రామనాథం.

''ఓ, అదా? అందులో మాయ ఏమున్నదీ? నువు నాకు ఎదురు రావడం వల్లే నిన్న నా వందరూపాయలు పోవడం జరిగింది. న్యాయంగా ఆ డబ్బు నువే ఇచ్చుకోవాలి గద,'' అన్నాడు రంగనాథం.

రామనాథం మరింత ఆవేశపడిపోతూ, ''ఏం న్యాయమయ్యా? నేను ఎదురు రావడానికీ, నీ డబ్బు పోవడానికీ ఏమిటి సంబంధం? నీ అజాగ్రత్త వల్ల డబ్బు పోగొట్టుకుని, మధ్యన నా శకునం అంటావా?'' అన్నాడు.

రామనాథం నవ్వుతూ, ''అయితే, శకునాలంటూ పాటించరాదంటావా ఏమిటి? శకునానికీ, పని జరిగే తీరుకూ సంబంధం లేదని ఒప్పుకుంటావన్నమాట! నీ భార్య నాకు డబ్బు ఇయ్యనూ లేదు, నేను తీసుకోనూ లేదు! నీ శకునాల పిచ్చి పోగొట్టడానికి ఈ ఎత్తు వేశాం!'' అన్నాడు.

అటు తరవాత రామనాథం ఎక్కడికైనా బయలుదేరబోతూ శకునం చూసే అలవాటు మానుకున్నాడు





# ఇద్దరు మోసగత్తెలు

## 2

హాజ్ ముహమ్మద్ తన దుకాణాన్ని ఒక పనివాడికి వప్పగించి బయలుదేరాడు. దిలైలా కూడా వెళ్ళి తాను దాచివుంచిన మూటలు తీసుకుని కొంతసేపటికి తిరిగి వచ్చింది. ఆమె పనివాడితో, "మీ యజమానిగారు రొట్టెల దుకాణంలో వున్నారు. నిన్ను వెంటనే రమ్మన్నారు. వెళ్ళు నాయనా, నువు తిరిగి వచ్చేదాకా దుకాణం నేను చూస్తూంటాలే!" అన్నది. పనివాడు బయటికి అడుగుపెట్టాడు.

దిలైలా దుకాణంలో ఉన్న సామానులో ఎత్తటానికి వీలైనదల్లా ఏరి ఒక పక్క పెట్టింది. దుకాణం ముందుగా మోతగాడిదను తోలుకుంటూ ఒక కుర్రవాడు వెళుతుంటే వాణ్ణి పిలిచి, "నీకీ దుకాణదారు తెలుసుగా, బాబూ? వాడు నా కొడుకే. మా వాణ్ణి అప్పులవాళు పట్టుకుపోయారు. ఈ సామానంతా ఊళ్లో వాళ్ళది. వాళ్ళకి తిరిగి ఇచ్చెయ్యాలి. దీన్ని నీ గాడిద మీద వేసి నా వెంట పంపిస్తావా? ఇదుగో ఒక దీనారం పుచ్చుకో. నేను మళ్లీ తిరిగి వచ్చేలోగా నీలిద్రావకం సీసాలూ, కర్రసామానూ పగలగొట్టెయ్యి, లేకపోతే జప్తు చేస్తారు," అన్నది.

గాడిదను తోలే కుర్రవాడు సరేనన్నాడు. దిలైలా సామానంతా గాడిద మీద వేసుకుని తిరిగి చూడకుండా ఇంటికి వెళ్ళిపోయింది. తల్లిని చూడగానే జీనాబ్, "అమ్మా, ఏం చేసుకొచ్చావు?" అని ఆత్రంగా అడిగింది.

"నలుగురి కళ్ళలో దుమ్ము కొట్టాను. ఇవి ఒక అధికారి భార్య నగలు. ఇవి ఒక దుకాణదారు సంచీ, చొక్కా. ఇవన్నీ

ఒక నీలివర్తకుడి సరుకులు. ఈ గాడిద నాలుగోవాడిది!'' అన్నది దిలైలా గర్వంగా.

''బాగానే ఉందిగాని అమ్మా, నువ్విక ఇల్లు కదలటానికి లేదు. వాళ్లు నలుగురూ నీ కోసం చూస్తూంటారు!'' అన్నది జీనాబ్.

''పిచ్చిదానా, ఇంకా అవగింజలో అరభాగం కాలేదు,'' అన్నది దిలైలా.

కలంకారీవాడు రొట్టెల దుకాణంలో రొట్టెలూ, కూరా కొంటూండగా పనివాడు వచ్చి, ఎందుకు పిలిచారని అడిగాడు. కలంకారీకి అనుమానం వేసి దుకాణానికి వచ్చి చూసేసరికి గాడిదల కుర్రవాడు దుకాణం ధ్వంసం చేస్తూ కనిపించాడు.

''ఇదేం పనిరా, నిన్ను పగలగొయ్యా!'' అన్నాడు కలంకారీ.

''మిమ్మల్ని బాకీదార్లు వదిలిపెట్టారు గద!'' అన్నాడు గాడిదల కుర్రవాడు.

వాళ్ళిద్దరూ ఒకరినొకరు అర్థం చేసుకునేటందుకు చాలాసేపు పట్టింది. చివరకు, ''ఆ ముసలి దెక్కడ?'' అని కలంకారీవాడూ, ''నా గాడిద మాటేమిటి?'' అని గాడిద గల కుర్రవాడూ లబలబలాడ సాగారు. చుట్టూ చాలా మంది పోగయారు. అందరూ కలిసి కలంకారీ ఇంటికి వెళ్లారు.



కలంకారీవాడు కింది భాగం తలుపు తట్టేసరికి చొక్కా లేకుండా వచ్చి మొహసిన్ తలుపు తెరిచాడు. ''దొంగ గాడిదా, మీ అమ్మ ఎక్కడ?'' అని అరిచాడు కలంకారీ. ''మా అమ్మపోయి ఎంత కాలమాయె!'' అన్నాడు మొహసిన్. వాళ్ళిద్దరూ ఒకరినొకరు అర్థం చేసుకోవటానికి మరి కొంతకాలం పట్టింది. చివరకు మొహసిన్, ''ఆ ముసలిది తన కూతుర్ని నా కిస్తానని పిలుచుకు వచ్చింది. వాళ్ళు పైనే ఉన్నారు!'' అన్నాడు.

కలంకారీ మెట్లెక్కి పైకి వెళ్లి తలుపు తట్టాడు. ఖాతూన్ వచ్చి తలుపు తీసింది. ''మీ అమ్మ ఎక్కడ?'' అని అడిగాడు



వర్తకుడు. "మా అమ్మ పోయి ఎంత కాలమాయె!" అన్నది ఖాతూన్.

నలుగురూ చాలా సేపు కూడబలుక్కున్న మీదట మోసం ఎట్లా జరిగిపోయిందీ తెలియవచ్చింది. ఖాతూన్‌ను ఆమె ఇంటికి పంపేసి మిగిలిన ముగ్గురూ నగర రక్షకుడైన ఖాలిద్ వద్దకు వెళ్ళి జరిగిన సంగతి చెప్పుకున్నారు.

ఖాలిద్ ఆశ్చర్యంతో వారు చెప్పిన విషయాలు విని, "ఈ మహా నగరంలో ఉండే ముసలమ్మలలో మిమ్మల్ని మోసం చేసినదాన్ని ఎట్లా పట్టుకోను? మీరే ఎట్లాగైనా శ్రమపడి అవిణ్ణి పట్టుకుంటే నేను తప్పక శిక్షిస్తాను," అన్నాడు.

గత్యంతరం లేక మోసపోయిన ముగ్గురూ మూడు వైపులా ముసలిదాన్ని వెతుకుతూ బయలుదేరారు.

ఈలోపల దిలైలా తాను ధరించిన సూఫీ భిక్షుకురాలి వేషం విప్పేసి, ఒక భాగ్యవంతుల పని మనిషి వేషం వేసుకుని, తన ప్రతాపంతో బగ్దాద్ పౌరులను వేపుకు తినటానికి మళ్ళీ బయలుదేరింది. ఆమె ఒక సందు చేరేసరికి అక్కడ ఒక ఇంట్లో తివాసీలూ, మేళతాళాలూ, దీపాలూ, పాటలూ, వేడుకలూ, కోలాహలమూ కనిపించింది. ఇంటి తలవాకిట ఒక బానిస మనిషి చిన్న కుర్రాణ్ణి చంకన వేసుకుని వున్నది. కుర్రాడి వంటి నిండా జరీ దుస్తులూ, రత్నాలు పొదిగిన ఆభరణాలూ, ముత్యాలచేర్లూ ఉన్నాయి.

ఆ ఇల్లుగలాయన బగ్దాద్ వర్తకులకు పెద్ద. ఆ రోజున ఆయన కుమార్తెకు ప్రధానం చేస్తున్నారు. చాలామంది అమ్మలక్కలు పేరంటం వచ్చారు. వర్తకుడి భార్య వచ్చినవారికి ఆతిథ్యం ఇవ్వటానికి వీలులేకుండా చిన్న కొడుకు ఆమెను పట్టుకుని మారాం చెయ్యసాగాడు. అందు చేత ఆవిడ వాణ్ణి బానిసదాని కిచ్చి, వచ్చినవాళ్ళు వెళ్ళేదాకా కాస్త ఆడిస్తూ వుండమన్నది. ఈ విషయాలన్నీ దిలైలా వీధిలోనే ఆరాతీసింది. ఆ కుర్రవాడి

వంటి మీది నగలు కాజేయాలని ఆమెకు దుర్బుద్ధి పుట్టింది.

దిలైలా జనంలో నుంచి తోసుకుని తల వాకిలి దగ్గిరికి వస్తూ, "నా ఇల్లు బంగారం కానూ, ఆలస్యం చెయ్యనేచేశాను!" అని గట్టిగా అన్నది. తరవాత ఒక చెల్లని నాణెం తీసి బానిసదాని చేతిలో పెట్టి, "మీ పాత దాది, ఉమాల్‌ఖయర్ సలాములు చెప్పవచ్చిందని అమ్మగారికి కాస్త చెప్పిరా, తల్లీ," అన్నది. బానిస నాణెం తీసుకుంటూ, "అబ్బాయిగారు అమ్మగారు కనిపిస్తే కొంగు పట్టుకుని వదలక మారాం చేస్తారు. నేనెల్లా వెళ్ళేదమ్మా?" అన్నది.

"నువు వచ్చేదాకా నేను పట్టుకుంటాలే, చిట్టితండ్రిని!" అన్నది దిలైలా బానిస ఈ మాటలు నమ్మి, పిల్లవాణ్ణి దిలైలా కిచ్చి లోపలికి వెళ్ళిపోయింది.

వెంటనే దిలైలా పిల్లవాణ్ణి తీసుకుని ఒక నిర్మానుష్యమైన గొందిలోకి పోయి పిల్లవాడి వంటి మీద వున్న ఖరీదైన నగలూ, బట్టలూ ఊడ్చేసింది. తరవాత వాణ్ణి తీసుకుని ఒక గొప్ప రత్నవర్తకుడి దుకాణానికి వెళ్ళింది. ఆ వర్తకుడు వర్తకుల పెద్ద యొక్క కుమారుణ్ణి వెంటనే ఆనవాలుపట్టి, "మీ యజమానికి ఏం కావాలి?" అని దిలైలాను అడిగాడు.



"ఈ పిల్లవాడి అక్కకు ప్రధానం చేస్తున్నారు. ఒక జత బంగారు గాజులూ, రెండు జతల బంగారు పాంజేబులూ, వరహాల చెవికమ్మలూ, నగిషీ వడ్డాణమూ కావాలి. మొత్తం వెయ్యి దీనారాలకు తక్కువ కాకుండా సొమ్ములు ఇప్పించండి. సరుకు తీసుకుపోయి అమ్మగారికి చూపించి, నచ్చితే డబ్బు తీసుకుని ఇప్పుడే వస్తాను. కావలిస్తే అందాకా అబ్బాయి నిక్కడే వుంచి పోతాను." అన్నది దిలైలా.

"నీ యిష్టం. కాని అబ్బాయిని వుంచవలిసిన అవసరం మటుకు లేదు." అన్నాడు రత్నవర్తకుడు. దిలైలా తను

దోచిన సొమ్మంతా తీసుకుని సరాసరి ఇంటికి వెళ్ళిపోయింది.

అక్కడ వర్తకుల పెద్ద ఇంట్లో సంబరం కాస్తా శోకాల కింద మారింది. ఇంటి పెద్ద వచ్చేసరికి ఇల్లు అల్లకల్లోలంగా ఉన్నది. వర్తకుడి భార్య కొడుకు కోసం పొర్లిగింతలు పెట్టి ఏడుస్తున్నది. పిల్లవాడి జాడ ఎవరికీ తెలీదు.

వర్తకుడు చాలా సేపు వెతికించిన మీదట, పిల్లవాడు రత్నవర్తకుడి దుకాణంలో దొరికాడు.

"దొంగవెధవా, నా పిల్లవాణ్ణి ఏమని తెచ్చావు? వాడి వంటి మీది నగలూ, దుస్తులూ ఏవి?" అని వర్తకుల పెద్ద ఆగ్రహంతో అడిగాడు.

"తమ యింటికి వెయ్యి దీనారాల నగలు పంపాను, వాటి మాటేమిటి?" అని విలవిలలాడాడు రత్నవర్తకుడు.

ఇద్దరూ ఒకరినొకరు అర్థం చేసుకోవటానికి చాలాకాలం పట్టింది. ఆ సమయానికే దిలైలా మోసగించిన మొదటి ముగ్గురూ అక్కడికి వచ్చారు అందరినీ మోసగించినది ఒక మనిషేనని తేలిపోయింది. ఒకరి కథ ఒకరికి చెప్పుకున్నారు.

"ఈ ముసలిదాని అంతు కనుక్కుంటేగాని నేను నిద్రపోను," అని వర్తకుల పెద శపథం చేశాడు. రత్న వర్తకుడు మిగిలిన ముగ్గురితో, "మీతోబాటు నేను కూడా ముసలిదాన్ని పట్టటానికి వస్తాను. కాని అందరమూ కలిసి వెతికితే లాభం ఉండదు. ఎవరిదారిన వాళ్ళం వెళ్ళి చుట్టుపక్కల ప్రాంతాలన్నీ వెతుకుదాం. మధ్యాన్నానికి అందరమూ హజ్‌మసూద్ అనే మంగలి దుకాణం దగ్గిర కలుసుకుందాం," అన్నాడు.

మధ్యాన్నం వేళకు గాడిద గల కుర్రవాడు మంగలి మసూద్ దుకాణం కేసి వెళుతుండగా వాడికి దిలైలా కనిపించింది. మారువేషంలో ఉన్నప్పటికీ వాడామెను గుర్తించి, "దొరికావా దొంగపీనుగా?" అన్నాడు. —(ఇంకా వుంది)





# విఘ్నేశ్వరుడు

దేవతలూ, రాక్షసులూ కలిసికట్టుగా క్షీర సాగరమథనం చేసి అమృతాన్ని సాధించారు. విష్ణువు జగన్మోహినీ రూపంతో రాక్షసులను మోసపుచ్చి అమృతాన్ని దేవతలపాలు చేశాడు. అమృతం తాగి అమరత్వం పొందిన దేవతలు గర్వంగా తిరగసాగారు. దానవులకు జరిగిన అన్యాయానికి దేవతలపై కసితీర్చుకోడానికి తారకాసురుడు ఘోరమైన తపస్సు చేసి, బ్రహ్మను మెప్పించి, చావులేనివరం కోరాడు.

"పుట్టాక ఎప్పుడో ఒకప్పుడు చావు తప్పనిది; మరోవరం కోరు!" అన్నాడు బ్రహ్మ.

తారకాసురుడు బాగా ఆలోచించి శివుడి కుమారుడి వల్లనే తప్ప మరే విధంగానూ తనకు చావులేని వరాన్ని బ్రహ్మ నుంచి పొందాడు.

అప్పటికి శివుడి భార్య సతీదేవి దక్ష యజ్ఞంలో యోగాగ్నితో తనువు చాలించింది. సంతానం లేకుండానే సతీ వియోగం పొందిన శివుడు ఉన్మత్తుడిలాగ తిరిగి, తిరిగి హిమాలయ పర్వతాల్లో ఒక చోట విరాగిగా కఠోర దీక్షతో తపస్సు చేస్తూ ఉన్నాడు.

తారకాసురుడు రాక్షసులందర్నీ కూడగట్టుకొని విజృంభించాడు. ముల్లోకాలనూ ఆక్రమించుకొని, కసితీరా దేవతలను చిత్రహింసలు పెట్టసాగాడు. ఇంద్రాది దేవతలు తమ దీనావస్థను బ్రహ్మతో మొరపెట్టుకున్నారు.

2. చిత్రగణపతి



"శివుడికి కుమారుడు పుట్టాలి, అతని వల్లనే తారకుడు చావాలి! అలాంటి వరాన్ని తారకుడికి ఇచ్చాను మరి. ఇంకె వరివల్లా తారకాసురుడికి ఎటువంటి హానీ జరగదు, మరో విధంగా అతడికి చావూ లేదు!" అని బ్రహ్మ చెప్పి దేవతలను వెంట బెట్టుకొని తరుణోపాయానికి విష్ణువు దగ్గిరికి దారితీశాడు.

"సతీదేవి హిమవంతుడికి కూతురుగా పుట్టి పార్వతిగా పెరుగుతూ ఉన్నది. శివుడికీ, పార్వతికీ పెళ్ళి జరిగేలా చూడండి!" అని విష్ణువు చెప్పాడు. దేవతలు నారదుణ్ణి హిమవంతుడి దగ్గిరికి పంపించారు. నారదుడి ఆదేశం ప్రకారం హిమవంతుడు తపస్సులో నిమగ్నుడై ఉన్న శివుడి దగ్గరికి వెళ్ళి, పూజించి తన కుమార్తె పార్వతి అతని తపస్సుకు అనుకూలంగా పరిచర్యలు చేస్తూండడానికి అనుమతించవలసిందని వినయపూర్వకంగా కోరాడు.

శివుడి మౌనాన్ని అంగీకారంగా గ్రహించి హిమవంతుడు పార్వతిని శివుడికి పరిచర్యలు చేయడానికి పురమాయించాడు.

చిన్నతనం నుంచీ పార్వతికి శివుడంటే చాలా యిష్టం. బాల పార్వతికి నారదుడు శివుడి గురించి అనేక విషయాలు చెపుతూండేవాడు. శివుడి కథలనూ, గుణగణాలనూ, మహిమలనూ పదేపదే వినడానికి కుతూహల పడుతూ ఉండేది పార్వతి. పెళ్లాడితే శివుణ్ణే పెళ్ళాడాలని ఉవ్విళ్లూరేది. అటువంటి శివుడికి పరిచర్యలు చేయడం తరుణప్రాయంలో ఉన్న పార్వతికి మహాభాగ్యంగా తోచింది.

తెల్లవారుతూండగా శివుడు తపస్సు చేస్తున్న పరిసర ప్రాంగణమంతా నెమిలి పించపుకట్టతో తుడిచి, హిమానీ జలాల్లో మంచిగంధం కలిపి కల్లాపుజల్లి, ముత్యాల ముగ్గులు తీర్చేది. బంగారు తీగెలతో అల్లి, రత్నాలు కెంపులు పొదిగిన తట్టతో శివుడికి యిష్టమైన ఫలపుష్పాలను, మారేడు

పత్రిని, తెల్ల కలువలనూ తీసుకెళ్ళి పక్క నుంచేది. బంగారు కమండలువు నిండా హిమశిఖరాల నుండి జారే స్ఫటిక జలాలను నింపి, జపమాలతో కలిపి అమర్చి పెట్టేది. శివుణ్ణి ఆకర్షించడానికి ఎన్నో విధాలుగా అలంకరించుకొని వెళ్ళేది. కిన్నెరపై శివుడికి ప్రీతికరమైన భైరవి, ముఖారి, కేదార, శివరంజని మొదలైన రాగాల్ని ఆలాపించేది. శివుడి చూపులు తనపై పడాలని పదేపదే ప్రయత్నిస్తూండేది.



తపోదీక్షలో నిమగ్నుడై శివుడు ఒక్కసారైనా తనను పరికించగలడేమోనని, అతని చల్లని చూపులు తనపై వాలాలని పార్వతి శివుడి ముఖాన్ని అలా చూస్తూ ఉండిపోయేది. శివుడు పొరపాటుగానైనా తనవంక చూడడేమో అని నిరాశా, నిస్పృహలతో ఊగిసలాడేది.

శివుడి మనస్సు చలించడానికి మన్మధుడి అవసరం తప్పనిసరి అని గుర్తించి, దేవేంద్రుడు మన్మధుణ్ణి పిలిపించాడు. సకలమర్యాదలు చేసి తన సింహాసనం మీద కూర్చోబెట్టి ఎన్నోవిధాలుగా పొగిడి పొంగవేశాడు, శివుడికి పార్వతిపై అనురాగం కలిగేలా చేయమని అర్థించాడు.

వసంతుడు సారథ్యం చేస్తూండగా మన్మధుడు చెరకు వింటినీ, పూలబాణాలనూ ధరించి రతీదేవితో చిలుకరథాన్నెక్కి, ఈశ్వరుడు తపస్సు చేస్తూన్న హిమాలయ శిఖరాల నడుమనున్న లోయను ప్రవేశించాడు. ఒక్కసారిగా ఆలోయ అంతటా వసంతఋతువు వెల్లివిరిసింది, రమణీయంగా మారింది. కోయిలల సంగీతంతో, తుమ్మెదల ఝుంకారంతో అంతా రసమయంగా వెలిగిపోయింది. తానున్న పరిసరమంతా ఆకస్మికంగా మారిపోయినట్లుగా తోచి, శివుడు కళ్ళు తెరిచి చూశాడు. అకాల వసంతాగమనానికి ఆశ్చర్యపోతూ, తపోభంగమైనందుకు నొచ్చుకుంటూండగా అతని చేతినుంచి జపమాల జారిపడింది. పార్వతి



జపమాలను తీసి శివుడికి అందిస్తున్న సమయంలో మన్మధుడు విరియబూచిన నల్లఉమ్మెత్త పూలపొద చాటునుంచి నీలోత్పల బాణాన్ని శివుడి గుండెకు గురి పెట్టి వదిలాడు. అది తగలగానే శివుడు తృళ్లిపడి తేరిపార జూచాడు. అతని మ్రోల మోకరిల్లి రెప్పవాల్చకుండా తననే చూస్తున్న పార్వతి ముఖబింబం ఎంతో మనోహరంగా కనిపించింది.

తన తపోభంగానికి శివుడు నివ్వెర పడుతూ రుద్రుడై తన మూడవ కంటిని తెరిచి మన్మధుడిని చూశాడు. మరు క్షణంలో శివుడి ఫాలనేత్రం నుంచి వెలువడిన జ్వాలల్లో మన్మధుడు కాలిబూడిద అయ్యాడు. శివుడు దిగ్గునలేచి చరచరా తన కైలాస శిఖరాగ్రం మీదికి వెళ్ళి పోయాడు.

మన్మధుడి వెన్నంటి ఉన్న రతీదేవి భర్త బూడిద కుప్పమీద కూలిపోయి ఘోరుమన్నది. శివ తపోభంగానికి మన్మధుణ్ణి పంపిన దేవేంద్రాది దేవతలను శాపాలు పెట్ట బోయేసరికి, బ్రహ్మాది దేవతలు వచ్చి పార్వతీ శివుల కళ్యాణం జరిగినప్పుడు మన్మధుడు తిరిగి బతికి వస్తాడని నచ్చజెప్పి, ఓదార్చి సహగమనం మానిపించారు. రతీదేవి మన్మధుడి బూడిద కుప్పనే కనిపెట్టుకొని అలా దివారాత్రాలు గడపసాగింది.

పార్వతికి తన సౌందర్యం పట్ల నమ్మకం పోయింది. శరీర లావణ్యం మీద మమకారం పోయింది. శివుణ్ణి రంజింప చేయలేని తన తనువు నిరర్థకంగా తలచి శివరంజనిగా తపస్సు చేయడానికి పూనుకున్నది. తల్లి మేనక ఎంతవద్దన్నా వినలేదు. కేవలం కొద్ది ఆకులను మాత్రమే తింటూ శరీరాన్ని కృశింప జేసుకొని తపస్సు మొదలుపెట్టింది. జయ, విజయ అనే ఇద్దరు చెలికత్తెలు ఆమెకు తోడుగా ఉంటూ ఆమె యోగక్షేమాల్ని మేనకా, హిమవంతులకు తెలియజేస్తూ వస్తున్నారు. కొన్నాళ్ళ తర్వాత పార్వతి పర్ణాలను

కూడా తినడం మానివేసి నిరాహారంగా తపస్సుచేస్తూ, అపర్ణ అని పేరు పొందింది.

శివుడు మన్మధుణ్ణి భస్మం చేశాడేగాని, మన్మధుడి బాణప్రభావం ఊరికేపోలేదు. పార్వతి తపస్సు కూడా ఫలితం సాధించింది. శివుడు మారువేషంతో పార్వతి దగ్గరకు వెళ్ళి, పార్వతి మనస్సును పరీక్షించాడు. పార్వతిని మనసారా మెచ్చుకొని పెళ్ళి చేసుకోవాలని నిశ్చయించుకున్నాడు. సప్త ఋషులను హిమవంతుడి దగ్గరకు పెళ్ళిపెద్దలుగా పంపించాడు. శివుడంతటి వాడికి కన్యాదాత కాబోతున్నందుకు ఉన్నతోన్నతంగా శిఖరాలు పెంచుకున్నాడు హిమవంతుడు. ఋషులు ముహూర్తం పెట్టి వెళ్ళారు.

ప్రమథగణాలు ముందు నడవగా శివుడు పెళ్ళికుమారుడై హిమవంతుడింటికి తరలివెళ్ళాడు. హిమాలయ శిఖరాలు పెళ్లిపందిరికి రాటలైనాయి. విష్ణువు, బ్రహ్మ, ఇంద్రుడు మొదలుగాగల దేవతలు, సప్తర్షుల వెంట వేలాదిమహర్షులు, నారదాది మునిపుంగవులు అక్కడకు చేరుకున్నారు.

పెద్ద ముత్తైదువు అరుంధతి శివుడి ఫాలనేత్రం రెప్పమీదుగా కళ్యాణ తిలకం నిలువుగా దిద్దింది. పెళ్ళి అలంకరణతో



శివుడు చాలా సుందరంగా తయారయ్యాడు. అప్పుడు అందరూ శివుణ్ణి— సుందరేశ్వరుడు అని అన్నారు.

సర్వాలంకార శోభితయై విద్యుల్లతలాగ మెరిసిపోతూన్న పార్వతిని పెళ్ళికూతురుగా తీసుకొచ్చి విష్ణువు శివుడితో, "నీవు సుందరేశ్వరుడివి అయితే,నాచెల్లెలు పార్వతి మీనాక్షిదేవి!" అని అంటూ పార్వతి కుడిచేతిని శివుడి కుడి చేతిలో పెట్టి యిద్దర్నీ పెళ్ళి పీటలమీద కూర్చోబెట్టాడు.

శివ పార్వతుల వివాహం ఎంత వైభవంగా జరగాలో అంత వైభవంగా జరిగింది.



హిమాలయలోయలో శివుడు, పార్వతి తపస్సులు చేసిన చోటనే దేవశిల్పి విశ్వకర్మ కొత్త దంపతులైన పార్వతీ పరమేశ్వరుల కోసం దివ్యమైన అంతఃపుర మందిరాన్ని నిర్మించాడు.

మంగళ తూర్యనాదాలు మిన్నంటుతూండగా చేతులు కలుపుకొని శివుడు, పార్వతి అందరిమధ్య నడుస్తూ మందిరానికి బయలుదేరారు. మందిరాన్ని చేరుకునే దారిలోనే మన్మధుడి భస్మరాశి ఉన్నది. ఆ బూడిదకుప్పను అంటిపెట్టుకొని రతీదేవి కన్నీళ్ళతో మోకరిల్లి దోసిలిపట్టి పతిభిక్ష అడుగుతున్న దానిలాగ ఉన్నది.

శివ పార్వతులు ఆమె దగ్గరకు వెళ్ళి, ఆమెతలపై చేతులుంచి దీర్ఘసుమంగళిగా ఉండు అని దీవించారు. శివుడు మళ్లీ తన మూడోకంటినే తెరిచి యీసారి చల్లని వెన్నెల కాంతితో చూడగానే భస్మరాసి మాయమై మన్మధుడు నిజరూపంతో లేచి అందరికీ కనిపించి, చెరుకువింటి నారిని ఝుమ్మనిపించి అదృశ్యమైయ్యాడు.

అప్పుడు శివుడు రతీదేవితో, ''అమ్మా! నీ భర్త తిరిగి జీవించాడు. నీకు ఎప్పటిలాగే సదా కనబడుతూనే ఉంటాడు. నీ రెండు కళ్ళకు తప్ప మరే మూడో కంటికీ కనిపించడు. ఎవ్వరూ అతణ్ణి చూడలేరు గనుక అతణ్ణి ఎవ్వరూ ఏమీ చేయలేరు. అతని బాణాల బారినుండి తప్పించుకోలేరు. నీకు తప్ప యితరులకు కనిపించడం అతని యిష్టంపైనే ఉంటుంది. అలాంటి వరాల్ని అతనికి ఇస్తున్నాను!'' అని చెప్పాడు.

పార్వతీ శివులు గృహప్రవేశం చేశారు. కనిపించని మన్మధుడు కూడా కనిపించని పూలబాణాలతో రతీదేవితో మందిరంలోకి వెళ్ళాడు. అరుంధతి నూతన దంపతులకు ఎర్రనీటితో దిష్టి తీసి, కర్పూరహారతి పట్టింది. అప్పుడు విశ్వకర్మ తెరతో నిండా కప్పబడి ఉన్న ఒక నిలువెత్తు పలకను పార్వతీ శివుల ఎదురుగా నిలబెట్టి, ''ఇది

ఒక గొప్ప అపురూప చిత్రపటము. ఈ చిత్రంలో ఇద్దరు చిత్రింపబడి ఉన్నారు. ఆ ఇద్దరిలో ఎవరి సౌందర్యం ఎక్కువ గొప్పదో మా బోటివారికి ఎవ్వరికీ చెప్ప శక్యంకాలేదు! అది చెప్పగలవారు మీ రిద్దరే నన్న నమ్మకంతో మీ ముందు పెడుతున్నాను, చెప్పండి!'' అని తెరను తొలగించాడు.

అది ఒక నిలువుటద్దం! అద్దంలో శివుడు పార్వతి తమ ప్రతిబింబాలను చూసి ముసిముసిగా నవ్వుకున్నారు.

''ముసిముసినవ్వులు సమాధానాలు కావు, చెప్పితీరాలి!'' అన్నాడు నారదుడు.

శివుడు చిరునవ్వుతో పార్వతిని క్రీగంట చూస్తూ, ''ధగధగా శుక్రుని లాగ మెరుస్తూన్న ముక్కర గల చిత్రాంగి సౌందర్యమే గొప్పది!'' అన్న వెంటనే పార్వతి సిగ్గుతో ఎర్రబడ్డ చెక్కిళ్ళతో, ''ఆ ముక్కంటి పురుషుడి సౌందర్యమే సృష్టిలో గొప్పది,'' అని వీణ మీటినట్లు పలికింది.

అందరూ శివపార్వతులపై పుష్పా క్షతలు చల్లి వెళ్ళిన తర్వాత కొత్త దంపతు లిద్దరూ పట్టుదిళ్ళు అమర్చిన తూగు టుయ్యాలపై కూర్చున్నారు.

వారి కెదురుగా విశాలమైన గోడ మీద మనోహరమైన పెద్ద చిత్తరువు చిత్రింపబడి



ఉన్నది. చిత్రం మధ్యలో అందమైన ఒక ఏనుగుల జంట నాట్యం చేస్తున్నట్లుగా ముందరికాళ్ళు ఎత్తి ఎదురెదురుగా ఎత్తిన తొండాలను పెనవేసుకొని ఉన్నవి. తోరణం కట్టినట్టు ఉన్న ఆ రెండు ఏనుగుల మధ్యనుంచి కనిపిస్తున్న సరో వరంలో పెద్ద పద్మము వికసిస్తూ ఉన్నది. ఆ చిత్రంలో చిత్రింపబడిన ఏనుగుల జంటపై శివ పార్వతుల చూపులు నిలి చాయి. అంతలో పద్మ చిత్రమున్నచోట వెన్నెల వంటి జ్యోతివెలిగింది. ఆ వెలుగు క్రమక్రమంగా పెద్దదై వ్యాపించింది. ఆ వెలుగులో శశివర్ణంతో మెరిసిపోతూన్న విఘ్నేశ్వరుడు వారికి కనిపించాడు.

విఘ్నేశ్వరుడి ముఖము ఏనుగు ముఖమే అయినప్పటికీ, ఆ ముఖంలో దివ్యత్వం నిండి ఉన్నది. ప్రసన్నత వెల్లి విరుస్తూన్నది. అతని చూపులు శాంతంగా మేధస్సునూ, శక్తినీ చాటుతున్నాయి. అతని దోరపుబొజ్జ నిండుగా తళతళలాడు తున్నది. అభయహస్తంతో నిల్చొని ఉన్న విఘ్నేశ్వరుడు పార్వతికి ముద్దులమూట లాగ కనిపించాడు.

విఘ్నేశ్వరుడిని చూస్తూంటే శివుడికీ, పార్వతికీ ఎన్నడూ ఎరగని అనిర్వచనీయ మైన ఆనందమేదో తమలో ఉప్పొంగు తూన్నట్లు అనిపించింది. ఆ ఆనందపార వశ్యంలో నోటమాటరాక విఘ్నేశ్వరుణ్ణి రెప్పవాల్చకుండా చూస్తున్నారు. విఘ్నే శ్వరుడు ఎడమపక్కకు సొంపుగా వంపు పెట్టి ఉన్న చిన్నారి తొండాన్ని సవరించు కొని ఊపుతూ, ముద్దుముద్దు మాటలతో, "నేను విఘ్నేశ్వరుణ్ణి! విఘ్నాలను అరి కట్టే వినాయకుడిని! పంచభూతగణాలకు అధిపతిని! గణపతిని! చిత్రవిచిత్రమైన రూపం గల చిత్రగణపతిని! మీ ఇరువురి అనురాగ ఫలితంగా శివుడి తేజస్సుతో కుమారస్వామి పుట్టి తారకాసురుణ్ణి అంత మొందిస్తాడు. కుమారస్వామికి ముందుగా నేను అవతరించి మీకు పుత్రుడిగా ఉంటాను. పుత్రగణపతినై అవతరించ బోతున్నాను!" అని చెపుతూంటే పార్వతి అతణ్ణి అందుకొని ఎత్తు'వాలని చేతులు చాచింది. విఘ్నేశ్వరుడు వెలుగుతో సహా అంతర్ధానమయ్యాడు.

అంతవరకు తమకు కనిపించిందంతా కలా, నిజమా అని పార్వతీ, శివులు ఒక రొకరు ప్రశ్నార్థకంగా చూసుకొన్నారు. ఆ చూపుల కలయికలో అంతా మర్చి పోయారు. వారికి కనిపించిన అద్భుత మంతా మరుపుకొచ్చింది.

శివుడు, పార్వతి ఆ మందిరంలో ఆనందసముద్రంలో మునిగి సంసారం సాగిస్తున్నారు. ఆ సమయంలోనే జగత్తుకు కనీవినీ ఎరగని ఉపద్రవం ముంచు కొచ్చింది.






# బావ-మరదలు

కోర్టు కట్టేసి ఇంటికి వచ్చిన సుబ్బిశెట్టి, ముందు గదిలో వున్న పెట్టెను చూసి, "మళ్ళీ ఎవరు దిగారు తేరగా తిని పోవడానికి?" అని చిరాకుగా భార్యను అడిగాడు.

"కాస్త చిన్నగా మాట్లాడండి. నన్ను చూడాలనిపించి, మా చెల్లెలు వచ్చింది. పెరట్లో స్నానం చేస్తున్నది," అన్నది అతడి భార్య పార్వతి.

సుబ్బిశెట్టి పెద్దగా నవ్వి, "నీ అంత అనాకారిని, పని గట్టుకుని చూడవచ్చే వారు కూడా వున్నారన్న మాట!" అన్నాడు.

పార్వతి మనసు చివుక్కుమన్నది. పెద్ద కట్నం తీసుకుని సుబ్బిశెట్టి ఆమెను పెళ్ళి చేసుకున్నాడు. ఆ రోజు నుంచి అనాకారి అని వేలెత్తి చూపుతూ, ఆమె మనసు గాయపరుస్తూనే వున్నాడు. స్వతహాగా సాధువయిన పార్వతి, ఆ బాధను ఎంతో కాలంగా తనలోనే దిగమింగుకుంటున్నది.

ఆమె భర్తకు మంచినీళ్లు అందిస్తూ, "గుర్తుంచుకుని, రేపు ఒక చీర తీసుకురండి," అన్నది.

"కొత్త చీరా! ఎందుకూ?" అన్నాడు సుబ్బిశెట్టి ఆశ్చర్యపోతూ.

"నా కోసం కాదండీ, మా చెల్లెలి కోసం. రాకరాక వచ్చింది కదా," అన్నది పార్వతి.

"ఇది మరీ బావుంది! మీవైపు వాళ్ళ కూ్కడా చీరెలూ, సారెలూ పెట్టాలని ముందే చెప్పివుంటే, మీ నాన్న దగ్గిర మరి కాస్త కట్నం గుంజి వుండేవాణ్ణి," అన్నాడు శెట్టి నిర్మొహమాటంగా.

అంతలో స్నానం చేసి మరదలు లక్ష్మి అక్కడికి రావటం చూస్తూనే శెట్టి నవ్వు

మాచిరాజు కామేశ్వరరావు



ముఖం పెట్టి, "ఇంత కాలానికా రావడం? కనీసం మీ అక్కనైనా చూడాలనిపించ లేదా ?" అన్నాడు.

"ఎక్కడ బావా, చదువుతో సరిపోతు న్నది," అన్నది లక్ష్మి నవ్వుతూ.

"అదీ నిజమే అనుకో. కాని, రాకరాక యిలాంటి సమయంలో వచ్చావేమిటి ? ఊరంతా ముసుగుదొంగల భయంతో అట్టుడికిపోతున్నది. దారిలో ఎవరైనా నిన్ను అటకాయించి వుంటే, ఏమయేది?" అన్నాడు శెట్టి.

"వాళ్ళకు నీ పేరు చెప్పి వుండేదాన్ని. కాళ్ళ మీద పడి క్షమాపణ కోరి వుండే వాళ్లు," అంటూ విరగబడి నవ్వింది, లక్ష్మి.

పెళ్ళినాడు సుబ్బిశెట్టి తన ధైర్య సాహసాలను గురించి ఎన్నో కల్పిత కథలు చెప్పాడు. లక్ష్మి అవేవీ మరిచి పోలేదు.

"నువ్వన్నమాటా, నిజమేలే!" అంటూ శెట్టి ఒక వెర్రినవ్వు నవ్వాడు.

ఆ సమయంలో రంగన్న అనే అతను వచ్చి, సుబ్బిశెట్టికి వంద రూపాయల మూట యిచ్చి వెళ్ళాడు. అతను రెండు సంవత్సరాలక్రితం శెట్టి దగ్గిర అప్పు చేసి, అది తీర్చకుండానే ఊరువదిలి పారి పోయాడు. అయితే, తరవాత రంగన్న పట్నంలో ఉద్యోగం సంపాయించి అనుకోకుండా ఆ రోజున వచ్చి పాత బాకీ తీర్చాడు.

సుబ్బిశెట్టి భార్యను పిలిచి, డబ్బు సంచీ, ఆమె చేతికిచ్చి, ఇనప్పెట్టెలో దాయమన్నాడు.

పార్వతి అతణ్ణి లోపలికి పిలిచి, "రాదనుకున్న డబ్బు వచ్చింది కదా ? ఒక చీర కొనుక్కరండి," అంటూ భర్తను బతిమాలింది.

"ఇంకా నయం! ఇనప్పెట్టె తలుపు మూసెయ్యి," అంటూ శెట్టి, భార్యను కసిరాడు.

పార్వతి మరి మాట్లాడలేదు. తరవాత ముగ్గురూ భోజనాలు చేశారు.

పార్వతి కంచాలు ఎత్తుతూ, "దొంగల భయం కదా. ఎంగిలి కంచాలు కూడా వంటగదిలోనే వుంచుకోవాల్సి వస్తున్నది." అన్నది చెల్లెలితో.

"అదేమిటి, అక్కా! బావ బయట కాపలా పడుకోవడం లేదూ? ఆయన పెరట్లో పడుకుంటే, ఏ దొంగకు మాత్రం గోడదూకి లోపలికి రావడానికి గుండె వుంటుంది, అవునా, బావా?" అన్నది లక్ష్మి.

"మరే, మరే!" అంటూ నీళ్ళు నమిలాడు శెట్టి. ఆరుబయట పడుకోవడం అన్న ఊహ రాగానే అతడికి కాళ్ళు వణకడం ప్రారంభమయింది.

లక్ష్మి స్వయంగా ఎంగిలి కంచాలు బావి పళ్ళెంలో పెట్టి, వచ్చి, "భయం లేదులే, అక్కా. బావ పెరట్లో పడుకుంటాడు," అన్నది.

పార్వతికి భర్త పిరికితనం తెలుసు. ఆమె, "ఆయన ఎలా పడుకుంటారే, ఆయనకి..." అంటూ ఏమో చెప్పబోయింది.

సుబ్బిశెట్టి చప్పున కల్పించుకుని, "నాకేం భయమనుకుంటున్నారా? దుడ్డుకర్ర మంచం కింద పెట్టుకుని పడుకుంటాను. ఏ దొంగవెధవయినా వచ్చాడో, బుర్ర బద్దలు కొట్టేస్తాను.



నా మంచం పెరట్లో వేసెయ్యి," అన్నాడు బింకంగా.

పార్వతి భర్తకు పెరట్లో మంచం వేసింది. శెట్టి మంచం కింద లావుపాటి దుడ్డుకర్ర పెట్టుకున్నాడు. అక్కా చెల్లెళ్ళు తలుపులు మూసుకుని లోపల పడుకున్నారు. సుబ్బిశెట్టి భయంతో వణికిపోతూ, అర్ధరాత్రివరకూ కన్ను మూయలేదు. తరవాత చిన్న కునుకుపట్టింది. అంతలో ఎవరో వీపు తట్టినట్లయి, మెలుకువ వచ్చింది.

ఎదురుగా ముసుగు దొంగ! అతడి చేతిలో మెరుస్తున్న కత్తి. శెట్టి గుడ్లు తేలవేసి, నోటమాట రాక, చేతితో మంచం



కిందికి సౌంజ్ఞచేశాడు. దొంగ మంచం కింద వున్న దుడ్డుకర్ర పైకి తీసి, "నన్ను కొట్టాలనే, యీ దుడ్డుకర్ర యిక్కడ దాచావన్న మాట?" అంటూ కత్తి పైకెత్తాడు.

శెట్టి ఎలాగో గొంతు పెగుల్చుకుని, "ఆ కత్తి చూస్తే, నాకు నోటమాట రావడం లేదు. దాన్ని మొలలో దాచి, దుడ్డుకర్ర చేతిలో వుంచుకోండి," అన్నాడు నీరసంగా.

"మాటలతో కాలయాపన చెయ్యకు, జాగ్రత్త! ముందు తలుపులు తెరిపించు. నాకు డబ్బు కావాలి," అంటూ దొంగ కత్తి ఝుళిపించాడు.

"లోపల ఆడవాళ్ళున్నారు. నా పరువు పోతుంది. బావిపళ్ళెంలో కంచాలున్నాయి. అవి పట్టుకుపోండి," అన్నాడు శెట్టి.

దొంగ గట్టిగా పళ్ళుకొరికి, "మీ ఎంగిలి కంచాలు నన్ను మోసుకుపొమ్మంటావా? మళ్ళీ నోరెత్తావంటే, నిలువుగా చీల్చెయ్యగలను!" అన్నాడు:

"కాస్త చిన్నగా మాట్లాడండి. లోపల నా భార్యే కాక, గుండెజబ్బు మనిషి నా మరదలు కూడా వున్నది," అంటూ శెట్టి పోయి కిటికీలోంచి, "పార్వతీ! పార్వతీ!" అని మెల్లిగా పిలిచాడు.

పార్వతి కళ్ళు నులుముకుంటూ వచ్చి, "భయం వేస్తున్నదా? లోపలికి వస్తారా?" అని అడిగింది.

"నీ మొహం. ఇవతల పెద్దమనిషి నిలబడి వున్నాడు. ఆయనకి అవసరంగా డబ్బు కావాలిట. సాయంత్రం రంగన్న యిచ్చిపోయిన డబ్బేగా మన దగ్గిరున్నది! పోయి, త్వరగా యిలా పట్టుకురా," అన్నాడు శెట్టి.

పార్వతి ఆశ్చర్యంగా భర్త ముఖం కేసి చూసి, డబ్బు సంచి తెచ్చి యిచ్చింది. సుబ్బిశెట్టి దాన్ని దొంగ చేతిలో పెట్టాడు. దొంగ మరి మాట్లాడకుండా చీకట్లోకి జారుకున్నాడు. సుబ్బిశెట్టికి యిక నిద్ర పట్టలేదు. డబ్బు పోయినందుకు కళ్ళ

నీళ్ళు పెట్టుకుంటూ, తెల్లవారే దాకా జాగరణ చేశాడు.

మర్నాడు లక్ష్మి, "బావా, నేను సాయంత్రం వెళ్ళిపోతున్నాను. వచ్చే టప్పుడు అక్క కోసం చీర తెద్దామను కున్నాను గాని; వీలుకాలేదు. డబ్బిస్తాను, ఒక చీర కొనుక్కురా," అంటూ డబ్బు సంచీ సుబ్బిశెట్టికి యిచ్చింది.

ఆ సంచీ చూసి శెట్టి ఉలిక్కిపడ్డాడు. దాన్ని రాత్రి అతను స్వయంగా దొంగ చేతికిచ్చాడు.

లక్ష్మి చిన్నగా నవ్వి, "అలా చూస్తావేం, బావా? దొంగకిచ్చిన సంచీ నా చేతిలోకి ఎలా వచ్చిందనా? ఆ దొంగను నేనేగా! దుప్పటి చుట్టబెట్టుకుని, పళ్ళు కోసుకునే కత్తి తీసుకుని, గొంతు మార్చి బెదిరించాను. నువ్వు పిరికివాడివే కాదు, లోభివి కూడా. స్నానం చేసివచ్చి, పక్కగదిలో వుండి, నీకూ, అక్కకూ జరిగిన సంభాషణ అంతా విన్నాను. అక్క అనాకారే! అది ఆవిడ తప్పు కాదు. బాహ్యంగా మారడం ఎవరికీ సాధ్యం కాదు. కాని, మానసికంగా మారేందుకు ఎవరైనా ప్రయత్నించవచ్చు. ఇప్పటికైనా, నీ కుళ్ళు బుద్ధి నుంచి బయటపడి, తాళికటిన భార్యను సూటీపోటీ మాటలతో హింస పెట్టడం మానుకుంటావని నమ్ముతున్నాను," అన్నది.

సుబ్బిశెట్టి వెలవెల పోయి, డబ్బు సంచీని విసురుగా లక్ష్మి మీదికి గిరవాటు వేసి, వీధిలోకి పోయాడు.

"మీ బావకు కోపం వచ్చింది. ఇంత నాటకం ఎందుకాడావు?" అంటూ పార్వతి భయపడిపోయింది.

అయితే కొద్ది సేపట్లోనే సుబ్బిశెటి రెండు ఖరీదైన చీరలు తీసుకుని, నవ్వు ముఖంతో తిరిగివచ్చాడు. పార్వతి పట్టరాని సంతోషంతో చెల్లెలి భుజం తట్టి, "మీ బావ మారిపోయాడు. ఏడాది కాలంలో ఏ మాత్రం మార్చలేని మనిషిని మరదలు ఒక్క రోజులో మార్చేసింది!" అన్నది.



## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 25 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1981 ఏప్రిల్ నెల సంచికలో ప్రకటింపబడును.







Devidas Kasbekar Devidas Kasbekar

★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకు సంబంధం ఉండాలి.)

★ ఫిబ్రవరి నెల 20-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంతమాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రూ. 25/—లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, (వ్యాఖ్యలకు సంబంధించని ఇతర విషయాలేవీ చేర్చరాదు.) ఈ అడ్రసుకు పంపాలి :—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు—26.

## డిసెంబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : ఉత్తుత్తి కుస్తీ

రెండవ ఫోటో : ఉన్నాము గస్తీ

పంపినవారు : శ్రీమతి ఆర్. స్వర్ణలత, 3/37 B, కాగితాల పేట. (కడప జిల్లా)

బహుమతి మొత్తం రు. 25/—ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. V. REDDI at Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) 188, Arcot Road, Madras-600 026 (India). Controlling Editor: NAGI REDDI.

# చందాదారులకు గమనిక

'చందమామ' కాపీలు పంపుటకు మీ చిరునామాలో ఏదైనా మార్పుంటే 5-వ తేది లోగానే, మీ చందా నంబరు ఉదహరిస్తూ మాకు తెలపాలి, ఆలస్యమైతే మళ్ళీ నెల వరకు మీ క్రొత్త అడ్రసును అమలు పెట్టడానికి వీలుండదు.

డాల్టన్ ఏజన్సీస్

'చందమామ బిల్డింగ్స్'

మదరాసు - 26

# లాలించండి

# మీరూ మురిసిపోండి

"అహా! మా నాన్నకి నేనంటే ఎంతో యిష్టం. అందుకే మరి నాకోసం రావల్‌గామ్ ఎక్లైర్స్ తెస్తాడు. కోకో, కోకోనట్ రెండూను.
నాకు తెలుసు...నాన్న కూడా దొంగలాగ చాటుగా తన కోసమూ ఉంచుకుంటాడు కొన్ని."




**Ravalgaon Eclairs**

ది రావల్‌గామ్ షుగర్ ఫార్మ్ లి. వాల్‌చంద్ గ్రూప్ పరిశ్రమ
హెడ్ ఆఫీసు: కన్‌స్ట్రక్షన్ హౌస్, వాల్‌చంద్ హీరాచంద్ మార్గ్, బల్లార్డ్ ఎస్టేట్, బొంబాయి 400 038.

Creative Unit-4638 Tel.

"న్యూట్రాముల్ మిగతావాటికన్నా తక్కువ ఖరీదు!"





Be a Nutramul 'dada'.

Nutramul
The strengthening all-family drink.

## ఇంచుమించు 3 రూపాయలు తక్కువ.

న్యూట్రాముల్. అమూల్ వారి తత్వాన్ని సాటే ఉజ్వల ఉదాహరణ: అమిత తక్కువ ధరలో అత్యంత, నాణ్యత.

మరి ప్రతి రోజూ వేలాది మంది న్యూట్రాముల్ వైపుపే మొగ్గుతున్నారంటే అందులో ఆశ్చర్యమేముంది గనక!




అమూల్ వారి

# న్యూట్రాముల్



మార్కెటింగ్ చేసేవారు:
గుజరాత్ కోపరేటివ్ మిల్క్ మార్కెటింగ్ ఫెడరేషన్ లిమిటెడ్, ఆనంద్, గుజరాత్

daCunha-GCM-31-TL

# రామ్ శ్యామ్

గురిచూసి కొట్టారు.






















నోరూరించే మనసుదోచే మైమరపించే పార్లే

పాపిన్స్ పండ్లరుచిగల పిప్పరమెంట్లు






5 పండ్ల సువాసనలలో- రాస్ప్‌బెర్రి, అనాస, నిమ్మ, నారింజ, మోసంబి.

everest/80/PP/309-tl.